కాఁబోఁగ నగు. జ్యేష్ఠకన్యావరులైన దంపతులకు రాశిమిత్రత్వముగాని మాసాధిపులమిత్రత్వముగాని గలిగియుండెనేని శుభకర మని మన్వాదుల యభిప్రాయము,

అవ. అథ వివాహే గురుఫలమాహ.—

వధ్వా ద్వాదశరంధ్రజన్మసు గురుర్వైధవ్యదస్స్యాత్త్రిష
ట్సంస్థః స్త్రీక్షయకృచ్చతుర్థదశమస్థానస్థితో దుఃఖకృత్,
ఆవశ్యం బలమార్యసూర్యశశినాం భానాం వివాహే ద్వయో
ర్దుష్టస్థానగతా అమీ తు విహితాస్తేషాం చ పూజాదినా. 59

వ్యా. వధ్వా ఇతి. వధ్వాః కన్యాయాః గురుః, ద్వాదశరంధ్రజన్మసు వధూజన్మలగ్నాజ్జన్మకాలచంద్రలగ్నాద్ద్వాదశాష్టమజన్మలగ్నేషు, స్థితస్సన్ వైధవ్యదస్స్యాత్, త్రిషట్సంస్థః వరస్య తృతీయషష్ఠస్థానగతో గురుః స్త్రీక్షయకృత్ పత్నీనాశకృద్భవతి, చతుర్థస్థానదశమస్థానయోః స్థితశ్చేత్ ఉభయోర్దుఃఖకృదుక్తవ్యతిరిక్తస్థానేషు స్థితశ్చేచ్ఛుభకరో భవతీత్యర్థాల్లభ్యతే, వివాహే ద్వయోర్దంపత్యోః, ఆర్యసూర్యశశినాం గురుసూర్యచంద్రాణాం, భానాం తారాణాం చ బలం ఆవశ్యకమ్. ఉక్తం చ - 'చంద్రతారాబలం వీక్ష్య దంపత్యోర్గురుసూర్యయోః, మాసే శుభే శుభదినే కారయేన్మంగళం ముదే.' అమీ గురుసూర్యచంద్రాః దుష్టస్థానగతా అపి పూజాదినా జపహోమదానాదినా, విహితాః వశీకృతాస్సంతః, తేషాం, దంపత్యోరిత్యర్థః. పూజాయాం బహువచనం, శుభదా భవంతీత్యర్థః.

తా. బృహస్పతి కన్యక జన్మలగ్నమునకైనను,జన్మచంద్రలగ్నమునకైనను ౮-౧౨ ఈస్థానములయం దున్నఁగన్యక విధవ యగు ననియును, వరుని జన్మలగ్నమునకు 3-౬ స్థానములయందున్న మృతభార్యావంతుఁడగు ననియు, ౪-౧౦ స్థానములయం దున్న దంపతులు దఃఖవంతులగుదు రనియు, ౨-౫, ౭-౯-౧౧ స్థానముల నున్న శుభకరుండగు ననియుఁ దెలిసికొనవలయు. ఇదియుఁగాక దంపతులకు రవిచంద్రబృహస్పతి తారాబలము లవశ్యముగాఁ జూడఁదగినది. సూర్యచంద్రబృహస్పతు లనిష్టస్థానమం దుండిరేని జపహోమదానాదులచే సంతుష్టులఁగావించిన శుభప్రదు లగుదురు.

అవ. అథ ద్వాభ్యాం శ్లోకాభ్యాం ఏకోదరాణాం వివాహనిషేధమాహ.—

ఏకస్యాపి సుతాద్వయం న విహితం నాప్యేకజన్యద్వయో
రేకస్మిన్నుదయే ద్వయోశ్చ వరయోర్దద్యాన్న పుత్రీద్వయమ్,
పుత్రీపుత్రశుభద్వయం న యుగపత్కార్యం న పుత్రద్వయో
రుద్వాహవ్రతయుగ్మమేకభవనే నాప్యన్యయో స్తద్ద్వయమ్. 60

వ్యా. ఏకస్యేతి. ఏకస్య పుంసః సుతాద్వయం ఏకోదరకన్యాద్వయం న విహితం న యోగ్యం, న దేయమితి యావత్, ఏకజన్యద్వయోః ఏకోదరయోః ద్వయోః వరయోరపి సుతాద్వయం పుత్రికాద్వయమపి న విహితం, ఏకస్మిన్నుదయే ఏకలగ్నే, ద్వయోః భిన్నోదరయోః వరయోః, పుత్రీద్వయం న దద్యాత్, పుత్రీపుత్రశుభద్వయం ఏకోదరయోః పుత్రీపుత్రయోః వివాహద్వయం యుగపత్ ఏకలగ్నే, న కార్యం పుత్రయోః ఉద్వాహవ్రతయుగ్మం వివాహయుగ్మం ఉపనయనయుగ్మం వా యుగపన్న కార్యం. కించ ఉద్వాహశ్చ వ్రతం చ ఉద్వాహవ్రతే తయోః యుగ్మం, ఏకలగ్నే ఏకగృహే చ అన్యయోర్భిన్నోదరయోరపి, తద్ద్వయం వివాహద్వయం ఉపనయనద్వయం వా ఏకలగ్నే న కార్యం, అపద్విషయే విశేషః.—'ఏకోదరోద్భవసుతాసుతయోర్వివాహం మాసాంతరే మనువసిష్ఠపరాశరాద్యాః, ఇచ్ఛంతి మంగళమథాశువదంతి గర్గాః కేచిత్తథైవ దివసేఽప్యుదయప్రభేదే.' అపరో విశేషః.—'ఏకలగ్నేఽపి భిన్నాంశే వసిష్ఠాత్రిపరాశరాః, తయోర్వివాహమిచ్ఛంతి పృథగ్గ్రామేఽథ మంటపే. శుభకృత్పుత్రికోద్వాహాత్పశ్చాత్పుత్రకరగ్రహః, ఏకతిథ్యామపి ప్రాహ భార్గవో భిన్నవేళయా.' బార్హస్పత్యే.—'ఏకస్మిన్ దివసేఽప్యేకలగ్నే భిన్నాంశకే తయోః, ఏకగర్భోదయోస్తత్ర వివాహశ్శుభకృద్భవేత్.' యమళవిషయే తు.—'ఏకస్మిన్ వత్సరే చైకవాసరే మంటపేఽపి చ, కర్తవ్యం మంగళం స్వస్రోర్భ్రాత్రోర్యమళజాతయోః. గణశః క్రియమాణానాం యుగపన్మాతృపూజనం, నాందీముఖం భవేదేకం హోమమంత్రాః పృథక్ పృథక్.'

అవ. రెండు శ్లోకములచే సహోదరుల కేకకాలవివాహమును నిషేధించుచున్నాఁడు.—

తా. ఒకవరునికి నిరువురు సహోదరకన్యకల నీయఁగూడదనియు, నన్నదమ్ములకు నక్కచెల్లెండ్ర నీయఁగూడదనియు, నొకలగ్నమందు భిన్నోదరవరులకైనను గన్యకాద్వయము నియ్యఁగూడదనియు, నొకలగ్నమందుఁ బుత్రీపుత్రులకు వివాహము చేయఁగూడదనియు, సోదరులకు రెండు వివాహములుగాని యుపనయనములుగాని చేయఁగూడదనియు, నొకనికి నుపనయనము నొకనికి వివాహము నొకగృహమం దొకలగ్నమందు

చేయఁగూడదనియు, భిన్నోదరులకైన నేకలగ్నమం దేకవేదికయందుఁ
జేయఁగూడదనియు భావము. ఆపత్కాలవిషయమై మన్వాదులు కొందఱు
మాసాంతరమందుఁ జేయవచ్చుననియుఁ, గొందఱు లగ్నాంతరమందుఁ
జేయవచ్చుననియుఁ, గొంద ఱేకలగ్నమం దంశాంతరమం దన్యగ్రామ
మందుఁ జేయవచ్చు ననియుఁ, గొందఱు పుత్రికావివాహానంతరమందుఁ
బుత్రవివాహముఁ జేయవచ్చుననియు, నమడులవిషయమై యేకకాలమందే
చేయవలయు ననియుఁ జెప్పియున్నారు.

పుత్రీపాణినిపీడనాచ్చ పరతస్సూనోర్వివాహశ్శుభో
నాన్యత్పుత్రకరగ్రహాత్తు న కిమప్యుద్వాహ ఏవ వ్రతాత్,
నాన్యత్పూర్వమృతుత్రయాత్స్వశరది హ్యేకోదరాణామయం
ప్రత్యుద్వాహవిధిస్తయోర్న శుభకృచ్ఛ్లోకేఽత్ర పూర్వత్ర చ. 61

వ్యా. పుత్రేతి. పుత్రీపాణినిపీడనాత్ దుహితృవివాహాత్, పరతః అనంతరం, సూనోః పుత్రస్య, వివాహశ్శుభః. పుత్రకరగ్రహాత్ పుత్రవివాహానంతరం, అన్యత్పుత్రికావివాహః పుత్రోపనయనాదికం, న శుభకృత్. వ్రతాత్ పుత్రోపనయనానంతరం, ఉద్వాహ ఏవ శుభః, న కిమపి, పునరుపనయనాదికం న శుభమిత్యర్థః. స్వశరది వివాహసంవత్సరే, 'సంవత్సరో వత్సరోఽబ్దో హాయనోఽస్త్రీ శరత్సమా' ఇత్యమరః. ఋతుత్రయాత్ షణ్మాసాత్పూర్వమేకోదరాణామన్యత్ ఉపనయనం న శుభం. అయం ప్రత్యుద్వాహవిధిః వివాహవిధిః తయోర్న శుభకృదితి అత్ర శ్లోకే పూర్వత్ర చ పూర్వశ్లోకేచోక్తః. అత్ర స్వశరదిత్యనేన అబ్దభేదే తు శుభకృదితి గమ్యతే, ఉక్తం చ.—'ఫాల్గునే చైత్రమాసే తు పుత్రోద్వాహోపనాయనే, అబ్దభేదాత్ప్రశస్యేత ఋతుత్రయవిడంబన' మితి.

తా. ఏకకాలమందుఁ బుత్రపుత్రికావివాహములలోఁ బుత్రికావివాహానంతరము పుత్రవివాహము ముఖ్యమనియుఁ, బుత్రవివాహానంతరమందుఁ బుత్రికావివాహమైనను బుత్రోపనయనమైనను జేయఁగూడదనియును, బుత్రోపనయనానంతరమందుఁ బుత్రికావివాహము శుభకర మనియుఁ, బుత్రవివాహము చేసినసంవత్సరమందు ౬ నెలల పర్యంత మేకోదరుల కుపనయనాదు లశుభకరములు (మఱియు నీవివాహవిధి యాక్రమమున నాసంవత్సరమందు ౬ నెలలు చేయఁగూడదని చెప్పఁబడినను సంవత్సరభేదమైన పక్షమందు నీచెప్పఁబడిన పరిమితిలేకయే వివాహాదులు చేయుట యుక్తముగాన ఫాల్గున

మాసమందు వివాహమునుజేసి చైత్రమాసమందు మరల నేప్రయోజన మైనఁ జేయవచ్చును.

అవ. అథ వివాహయోగ్యాయోగ్యసంబంధమాహ.—

చాతుర్థీం చ వధూం చతుర్థపురుషస్తాం పంచమీం చోద్వహే
న్నో షష్ఠీం తు సముద్వహేత్తు యువతీం నో పంచమీం పంచమః,
తార్తీయాం తు వధూం తృతీయపురుషస్తాముద్వహేన్నోద్వహే
దిత్యన్యే ప్రవదంతి సప్తమజనాదూర్ధ్వం పరేషామివ. 62

వ్యా. చాతుర్థీమితి. చతుర్థపురుషః కూటస్థాత్ చతుర్థపురుషః, చాతుర్థీం వధూం స్త్రియం ఉద్వహేత్. కించ చతుర్థ ఏవ పంచమీం కూటస్థాత్పంచమీం, తాం వధూం చ ఉద్వహేత్, కింతు చతుర్థః షష్ఠీం యువతీం తు, నో సముద్వహేత్పంచమః పంచమపురుషః, పంచమీ యువతీం, నో సముద్వహేత్తృతీయపురుషః తార్తీయాం తృతీయవధూం చ ఉద్వహేత్, నోద్వహేదిత్యన్యే. తృతీయం తార్తీయాం నోద్వహేదితి కేచిత్ ప్రవదంతీత్యర్థః. ఇయం వ్యవస్థా సప్తమజనాత్సప్తమపురుషపర్యంతం, సప్తమజనాదూర్ధ్వం తు పరేషామివ సపిండానామివ సంబంధః. నో పంచమీం పంచమ ఇత్యత్ర విశేషో ద్రష్టవ్యః-'పంచమః పంచమీం కన్యాం నోద్వహేదితి యద్వచః, పితృపక్షే నిషేధోఽయం మాతృపక్షే న తద్భవే' దితి.

అవ. వివాహమునకు యోగ్యాయోగ్య సంబంధములఁ జెప్పుచున్నాఁడు.—

తా. కూటస్థపురుషుఁడు మొదలు ౪-వ పురుషుఁడు నాలవస్త్రీకిని, ౫-వ స్త్రీకిని వివాహము చేయవచ్చును. చతుర్థపురుషుఁడు షష్ఠస్త్రీని వివాహము చేసికొనఁగూడదు. పంచమపురుషునికిఁ బంచమస్త్రీని వివాహము చేయఁగూడదు. తృతీయపురుషునికిఁ దృతీయస్త్రీని వివాహము చేయవచ్చును, కూడ దని కొందఱిమతము. ఈచెప్పఁబడిన నియమము సప్తమపురుషపర్యంతమే గాన, అనంతరము సామాన్యబంధు సంబంధము వలెనే వివాహము చేయవచ్చును. ఈపంచమస్త్రీ పంచమపురుష వివాహము తండ్రివరుసఁ గూడ దనియుఁ, దల్లివరుస నుత్తమంబనియు కొందఱిమతము.

అవ. అథ గండర్క్షజాతకన్యాఫలమాహ.—

మూలా హి ప్రభవా వధూశ్శ్వశురతత్పత్న్యౌ నిహంతి క్రమా

దంత్యాద్యంఘ్రిసముద్భవా త్వథ భవేజ్జ్యేష్ఠర్క్షజా శ్రేష్ఠజమ్,
ఇంద్రాగ్నిప్రభవా వివాహసమయే హంత్యేవ సా దేవరం
త్రిష్వేతేష్వపి భేషు జాతపురుషో హంతీతి కేచిజ్జగుః. 63

వ్యా. మూలేతి. మూలాహిప్రభవా మూలాశ్లేషానక్షత్రజాతా, వధూః క్రమాత్ శ్వశురతత్పత్న్యౌ మూలాజా శ్వశురం భర్తృజనకం, ఆశ్లేషజా తత్పత్నీం శ్వశ్రూం, మూలాహిప్రభవేతి కృత్స్నం మూలాశ్లేషయోః నిషేధే ప్రాప్తే పాదభేదేన వ్యవస్థాపయతి. అంత్యాద్యంఘ్రిసముద్భవా మూలాంత్యపాదే ఆశ్లేషాద్యపాదే సముద్భవా, వధూః శ్వశురతత్పత్న్యౌ నిహంతి. అథ జ్యేష్ఠర్క్షజా శ్రేష్ఠజం భర్తృజ్యేష్ఠం నిహంతి, ఇంద్రాగ్నిప్రభవా విశాఖానక్షత్రజాతా, వధూః వివాహసమయ ఏవ, దేవరం స్వభర్తృకనిష్ఠం, హంతి. ఏతేషు త్రిషు భేషు మూలాశ్లేషాజ్యేష్ఠానక్షత్రేషు జాతః పురుషోఽపి పూర్వోక్తాన్ హంతీతి కేచిజ్జగుః ఊచుః. గై శబ్ద ఇతి ధాతోర్యాత్తే లిట్, త్రిష్విత్యుపలక్షణం విశాఖజోఽపి దోషకృత్. అయం న సమీచీనః పక్ష ఇత్యస్వరస సూచనాయ కేచిదిత్యుక్తం.—'మూలాసార్పవిశాఖాసు జ్యేష్ఠభే చోద్భవః పుమాన్, న దోషకృద్వివాహేషు స్త్రియం సర్వత్ర వర్జయేత్' ఇతి విద్యమానత్వాత్.

అవ. గండనక్షత్రమందుఁ బుట్టినవారలకు ఫలములఁ జెప్పుచున్నాఁడు.—

తా. మూలానక్షత్రమందుఁ బుట్టిన స్త్రీ మామకు కూడదనియు, ఆశ్లేషయందుఁ బుట్టిన స్త్రీ యత్తకుఁ గూడదనియు, నీమూలాశ్లేషలయందుఁ గూడదని సామాన్యముగాఁ జెప్పినను మూలానక్షత్ర నాల్గవ పాదమందుఁ బుట్టిన మామకు మారకురాలనియు, నాశ్లేష మొదటి పాదమందుఁ బుట్టిన నత్తకు మారకురాలగునది విశేషం బనియు, జ్యేష్ఠానక్షత్రమందుఁ బుట్టినస్త్రీపతి జ్యేష్ఠభ్రాతృ నాశకారిణి యగుననియు, విశాఖానక్షత్రమందుఁ బుట్టిన స్త్రీ వివాహకాలమందే మఱఁదికి మారకురాలనియు, నీమూలాశ్లేషాజ్యేష్ఠావిశాఖా నక్షత్రములయందుఁ బుట్టిన పురుషుఁడు క్రిందఁ జెప్పినవారికి మారకుఁడని కొందఱు చెప్పినను స్త్రీలకుఁ గాని పురుషులకు దోషము లేదనియు భావము.

అవ. అథ శ్లోకద్వయేనైకవింశతిమహాదోషనామాన్యాహ—

యుగపంచాంగవిశుద్ధిహీనదినకృత్సంక్రాంత్యహః పాపినాం
షడ్వర్గః కునవాంశకోఽష్టమకుజష్షట్కం భృగోః కర్తరీ,

లగ్నాదష్టమమష్టమేందురుభయోశ్చంద్రోఽష్టరిప్ఫారిగ
శ్చంద్రస్సగ్రహ ఏవ వారజనితస్స్యాద్దుర్ముహూర్తాభిధః. 64
ఖార్జూరిస్థసమాంఘ్రిభం గ్రహణభం చోత్పాతభం క్రూరయు
గ్ధిష్ణ్యం చాశుభవిద్ధభం విషయుతం లగ్నాస్తదోష స్తథా,
గండాంతో వ్యతిపాతవైధృతిమహాయోగా ఇతి స్వాభిధా
లగ్నస్యాప్యఖిలైకవింశతిమహాదోషాన్ప్రవక్ష్యేఽథ తాన్. 65

వ్యా. య ఇతి. ఖార్జూరిస్థేతి చ. యః పంచాంగశుద్ధిహీన ఇత్యేకః, దినకృత్సంక్రాంత్యహ ఇత్యేకః, పాపినాం షడ్వర్గ ఇత్యేకః, శునవాంశ ఇత్యేకః, అష్టమకుజ ఇత్యేకః, భృగోష్షట్కమిత్యేకః, కర్తరీత్యేకః, లగ్నాదష్టమమిత్యేకః, ఉభయోర్దంపత్యోరష్టమేందురిత్యేకః, చంద్రోఽష్టరిప్ఫారిగ షడష్టరిప్ఫచంద్రదోష ఇత్యేకః, చంద్రస్సగ్రహ ఇత్యేకః, వారజనితదుర్ముహూర్తాభిధ ఇత్యేకః, ఖార్జూరిస్థసమాంఘ్రిభమిత్యేకః, గ్రహణభమిత్యేకః, ఉత్పాతభమిత్యేకః, క్రూరయుగ్ధిష్ణ్యమిత్యేకః, అశుభవిద్ధభమిత్యేకః, విషయుతం విషయుతలగ్నమిత్యేకః, లగ్నాస్తదోష ఇత్యేకః, గండాంత ఇత్యేకః, వ్యతీపాతవైధృతిమహాయోగ ఇత్యేక ఏవ దోష ఇత్యవశ్యమంగీకార్యః, న తు భిన్నకాలికయో స్తయోరేకదినే యోగాసంభవాదితి శంకనీయమితి సర్వమవధేయం. ఏతే సర్వే మిళిత్వా ఏకవింశతిదోషా భవంతి, తాన్ శ్లోకద్వయేనోక్తానఖిలైకవింశతిమహాదోషాన్ లగ్నస్య వక్ష్యే కథయామి.

అవ. రెండుశ్లోకములచె నిరువదియొక మహాదోషనామములఁ జెప్పుచున్నాఁడు.—

తా. పంచాంగశుద్ధిహీనమని, సంక్రాంత్యహస్సని, పాపషడ్వర్గమని, శునవాంశమని, అష్టమకుజుఁడని, భృగుషట్కమని, కర్తరియని, లగ్నాష్టమదోషమని, అష్టమచంద్రుఁడని, షడష్టరిప్ఫరిచంద్రదోషమని, చంద్రసహదోషమని, వారజనితదుర్ముహూర్తమని, ఖార్జూరిస్థసమాంఘ్రిభమని, గ్రహణభమని, ఉత్పాతభమని, క్రూరయుగ్ధిష్ణ్యమని, అశుభవిద్ధమని, విషయుతలగ్నమని, లగ్నాస్తదోషమని, గండాంతమని, వ్యతీపాతవైధృతిమహాయోగమని యీ యిరువదియొకమహాదోషముల వివరమును పైనఁ దెలియఁజేయుచున్నాఁడు.—

అవ. శ్లోకద్వయనిర్దిష్టానామేకవింశతిమహాదోషాణాం స్వరూపం నిర్వక్తుం ప్రథమోపదిష్టయోః పంచాంగశుద్ధిహీనదినకృత్సంక్రాంతిదోషయోర్లక్షణం దర్శయతి.—

దుష్టాశ్చేత్కరణర్క్ష వారతిథయో యోగశ్చ తన్మేళనం
నాడ్యష్షోడశ షోడశే త్వుభయతో వర్జ్యా రవేస్సంక్రమాత్,
రాశిష్వేవ చరేషు చైకదివసస్త్యాజ్యోయనే రాశివ
త్తద్రాశిం గతవేవ తత్తదయనం ప్రాప్తో యదా భాస్కరః. 66

వ్యా. దుష్టా ఇతి. యే దుష్టాః కరణర్క్ష వారతిథయః యోగశ్చయః తన్మేళనం తేషాం తిథివారనక్షత్రయోగకరణానాం పంచానాం మేళనం చేత్, కరణేషు భద్రః, ఋక్షేష్వనుక్తాని పుష్యాదీని, వారేషు కుజః, యోగేషు పరిఘావ్యాఘాతాదయో వక్ష్యమాణాః, తిథిషు మాసాంతే దినపంచక ఇతి శ్లోకోక్తాః ఏతే దుష్టాః ఏతైర్యథాసంభవం యుక్తమేవ పంచాంగస్య దుష్టత్వం. ఏవం పంచాంగశుద్ధిహీనో దోష ఇత్యుచ్యతే. రవేస్సూర్యస్య సంక్రమాదుభయతః పూర్వం షోడశనాడ్యః పశ్చాచ్చ షోడశనాడ్యశ్చ వర్జ్యాః శుభకర్మసు త్యాజ్యాః, చరేషు చరరాశిష్వేవ మేషకర్కటతులామకరేషు, రవిసంక్రమణేషు, ఏకదివసః పూర్వం త్రింశద్ఘటికాః పరే చ త్రింశద్ఘటికాః త్యాజ్యా ఇత్యర్థః. శుభకర్మస్వితి శేషః. అయనే రాశివత్ యత్సంక్రమణే యావద్ఘటికాః తదయనేఽపి తావద్ఘటికాః త్యాజ్యా ఇత్యర్థః. భాస్కరస్సూర్యః యదా యస్మిన్కాలే యదయనం ప్రాప్నోతి తథైవ తద్రాశిం గతఏవ. న సందేహ ఇత్యేవకారార్థః. ఏషః దినకృత్సంక్రాంతిదోషః.

అవ. క్రింద రెండు శ్లోకములయందుఁ జెప్పఁబడిన యేకవింశతి మహాదోషస్వరూపములఁ దెలియఁజేయుచున్నవాఁడై ముందుఁ బంచాంగశుద్ధిహీనదోషలక్షణమును, సంక్రాంతిదోషలక్షణమును దెలియఁజేయుచున్నాఁడు.—

తా. అశుభకరములైన తిథివారనక్షత్రయోగకరణములు కూడినది పంచాంగశుద్ధిహీనదోష మని, శుభకర్మలవిషయమై సూర్యసంక్రమణప్రవేశమునకు ముందు వెనుక ౧౬ ఘడియలు వర్జింపవలయు నని, సూర్యుఁడు మేషకర్కట తులామకరరాసులయందుఁ బ్రవేశమునకు ముందు ౩౦-ఘడియలను వెనుక ౩౦-ఘడియలను నిషేధింపవలయు ననియు, అయనములకు నిషేధవిధి యీ ప్రకారమే యనియు, నిదే దినకృత్సంక్రాంతిదోష మనియు నెఱుఁగవలయును.

అవ. అథ పంచభిశ్శ్లోకైః షడ్వర్గస్వరూపం ప్రపంచయితుం ఆదౌ తావత్తదుపయోగిరాశ్యధిపతీనాహ.—

మేషో గౌర్మిథునం కుళీరమృగరాట్కన్యాతులావృశ్చికా
శ్చాపాఖ్యో మకరో ఘటోఽఝష ఇతి హ్యేతే గృహాఖ్యాః క్రమాత్,
భౌమశ్శుక్రబుధేందుసూర్యశశిజా భృగ్వారజీవాసితా
మందో జీవ ఇతి క్రమేణ గృహపా ఏతే హి షడ్వర్గపాః. 67

వ్యా. మేష ఇతి. మేషః ప్రసిద్ధః, గౌః వృషభః, మిథునం ప్రసిద్ధం, కుళీరః కటకః, మృగరాట్ సింహః, కన్యాతులావృశ్చికాః ప్రసిద్ధాః, చాపాఖ్యో ధనుః, మకరః ప్రసిద్ధః, ఘటః కుంభః, ఝషో మీనః, ఇత్యేతే ద్వాదశరాశయః, క్రమాత్ గృహాఖ్యాః రాశిసంజ్ఞాః. 'ఆఖ్యాహ్వే అభిధానం చ నామధేయం చ నామ' చేత్యమరః. భౌమశ్శుక్రబుధేందుసూర్యాః ప్రసిద్ధాః, శశిజో బుధః.— 'పంచమ్యాహాజీ'తి జనేర్డప్రత్యయః. భృగుశ్శుక్రః, ఆరోఽఙ్గారకః, జీవో గురుః, అసితశ్శనిః, మందశ్శని, పునర్జీవో గురుః, ఏతే ద్వాదశక్రమేణ భౌమాది క్రమేణ, గృహపాః రాశ్యధిపాః ఏతే రాశ్యధిపతయ ఏవ, షడ్వర్గపాః షడ్వర్గాధిపతయశ్చ, భవంతి. హీతి ప్రసిద్ధౌ. అయమర్థః మేషవృశ్చికయోర్భౌమః, వృషభతులయోశ్శుక్రః, మిథునకన్యయోర్బుధః, కర్కటస్య చంద్రః, సింహస్య సూర్యః, ధనుర్మీనయోర్గురుః, మకరకుంభయోశ్శనిరితి.

అవ. ఐదుశ్లోకములచే షడ్వర్గస్వరూపములఁ దెలియఁజేయుటకై షడ్వర్గోపయోగులగు రాశ్యధిపతులఁ జెప్పుచున్నాఁడు.—

తా. మేష, వృషభ, మిథున, కర్కాటక, సింహ, కన్య, తుల, వృశ్చిక, ధను, ర్మకర, కుంభ, మీనములు ౧౨ ను రాసులనియు, మేష వృశ్చికములకు నంగారకుఁడు, వృషభతులలకు శుక్రుఁడు, మిథునకన్యలకు బుధుఁడు, కర్కాటకమునకుఁ జంద్రుఁడు, సింహమునకు సూర్యుఁడు, ధనుర్మీనములకు గురువు, మకరకుంభములకు శనైశ్చరుఁడు, వీరలీక్రమమున రాశ్యధిపతులు; వీరలే షడ్వర్గాధిపతులును.

సౌమ్యానామపి రాశయశ్శుభగృహాః క్రూరగ్రహాః పాపినాం
సర్వేషాం క్రమశశ్చరస్థిర ఇతి స్యాద్ద్విస్వభావోఽభిధాః,
త్రింశద్భాగమయం చ లగ్నమథ తల్లగ్నే ద్వయోర్భాగయో
రర్థేండూవిషమే సమే శశిరవీ హోరేశ్వరౌ తౌ క్రమాత్. 68

వ్యా. సౌమ్యానామితి. సౌమ్యానాం శుభగ్రహాణాం సంబంధినో రాశయః శుభగ్రహాః, శుభరాశయ ఇత్యుచ్యంతే, పాపినాం క్రూరగ్రహాణాం సంబంధినో రాశయః, క్రూరగ్రహాః క్రూరరాశయః, సర్వేషాం ద్వాదశరాశీనాం, క్రమశః క్రమాత్, చరస్థిరద్విస్వభావా ఇత్యభిధాః చరస్థిరస్వభావసంజ్ఞాః స్యుః. యథా, మేషశ్చరః, వృషభః స్థిరః, మిథునం ద్విస్వభావః, ద్వౌ చరస్థిరస్వభావౌ యస్య స తథోక్తః, పూర్వార్ధస్య స్థిరరాశిసమీపత్వాత్ స్థిరత్వం, ఉత్తరార్ధస్య చరరాశిసమీపత్వాచ్చరత్వం, పునః కర్కటశ్చరః, ఏవం ద్వాదశాదీనాం క్రమాత్ చరస్థిరద్విస్వభావత్వం యోజనీయం, త్రింశద్భాగమయం త్రింశద్భాగాత్మకం లగ్నమిత్యుచ్యతే, అథ తల్లగ్నత్రింశద్భాగాత్మకే లగ్నే ద్వయోర్భాగయోః పూర్వార్ధోత్తరార్ధయోః విషమే మేషమిథునసింహధనుఃకుంభానాం పూర్వార్ధస్య అర్కస్సూర్యః హోరాధిపతిః ఉత్తరార్ధస్య ఇందుశ్చంద్రః, సమే, వృషభకర్కటకన్యావృశ్చికమకరమీనానాం పూర్వార్ధస్య చంద్రో హోరాధిపః ఉత్తరార్ధస్య రవిః క్రమాత్ హోరేశ్వరౌ భవత ఇత్యవగంతవ్యమ్.

తా. సౌమ్యగ్రహసంబంధిరాసులు శుభరాసులనియు, పాపగ్రహసంబంధిరాసులు క్రూరరాసులనియు, ఈ ౧౨ రాసులలో మేషము చరమని, వృషభము స్థిరమని, మిథునము ద్విస్వభావమని యీప్రకారము ౧౨ రాసులకుఁ జూడవలెను. లగ్నము 30 భాగములుగలది; లగ్నము రెండుభాగములుచేసిన హోర లగు. అందులో మేషాదివిషమరాసులయందుఁ బ్రథమభాగము సూర్యహోర, ద్వితీయభాగము చంద్రహోర; వృషభాదిసమరాసులయందుఁ బ్రథమభాగము చంద్రహోర, ద్వితీయము సూర్యహోర, ఈ రెండుగ్రహములు హోరాధిపతులు.

అవ. అథ ద్రేక్కాణాధిపతీనాహ.—

తల్లగ్నేశ సుతేశధర్మపతయో ద్రేక్కాణపాస్స్యుస్త్రయ
స్స్వాంత్యోపాంత్యగృహేశ్వరా ఇతి జగుర్ద్రేక్కాణపాశ్చాపరే,
కేచిత్స్వాత్మజధర్మపా ఇతి జగుర్ద్రేక్కాణపాస్స్యుశ్చరే
ధర్మస్వాత్మజపాస్థిరే సుతనవస్వేశా ద్విరూపే గృహే. 69

వ్యా. తల్లగ్నేతి. తల్లగ్నేశసుతేశధర్మపతయః క్రమాత్ ద్రేక్కాణపాస్స్యుః, త్రింశద్భాగాత్మకస్య లగ్నస్య తృతీయో భాగః ద్రేక్కాణశబ్దార్థః. అయమాశయః, యస్య లగ్నస్యయోఽధిపః సఏవ ప్రథమద్రేక్కాణాధిపః, సుతేశః లగ్నాత్పంచమలగ్నాధిపో యః సఏవ ద్వితీయద్రేక్కాణాధిపః, ధర్మపతిః లగ్నాన్నవమలగ్నాధిపతిర్యస్సఏవ తృతీయద్రేక్కాణాధిపతిః, స్వాంత్యోపాంత్య

గృహేశ్వరాః, స్వం లగ్నం అంత్యో ద్వాదశ, ఉపాంత్య ఏకాదశ, ఏతేషామధిపాః ఏతే త్రయః ద్రేక్కాణాధిపా ఇత్యపరే జగుః ఊచుః. గైశబ్దే ఇతి ధాతోర్వ్యాఖ్యాతారే లిట్, కేచిత్తు చరే చరలగ్నేష్విత్యర్థః. స్వాత్మజధర్మాః లగ్నపంచమనవమాః పాంతి రక్షంతీతి తథోక్తాః, స్థిరే స్థిరలగ్నేషు ధర్మస్వాత్మజపాః నవమప్రథమపంచమాధిపాః ద్రేక్కాణాధిపతయః, ద్విరూపే గృహే ద్విస్వభావలగ్నేషు సుతనవస్వేశాః పంచమనవమప్రథమలగ్నాధిపతయః ద్రేక్కాణాధిపతయస్స్యురితి జగుః.

అవ. ద్రేక్కాణాధిపతులఁ జెప్పుచున్నాఁడు.—

తా. లగ్నమును మూఁడుభాగములు చేసిన ద్రేక్కాణములగు నందు లగ్నాధిపతి ప్రథమద్రేక్కాణాధిపతియు, పంచమాధిపతి ద్వితీయద్రేక్కాణాధిపతియు, నవమాధిపతి తృతీయద్రేక్కాణాధిపతియు నిట్లు కొందఱి యభిప్రాయము. లగ్నాధిప ద్వాదశాధిపతి యేకాదశాధిపతులు క్రమంబుగ ద్రేక్కాణాధిపతులని కొందఱ యభిప్రాయము. లగ్నాధిప పంచమాధిప నవమాధిపతులు చరలగ్నద్రేక్కాణాధిపతులనియు, నవమాధిప లగ్నాధిప పంచమాధిపతులు స్థిరలగ్న ద్రేక్కాణాధిపతు లనియుఁ, బంచమాధిప నవమాధిప లగ్నాధిపతులు ద్విస్వభావలగ్న ద్రేక్కాణాధిపతు లనియు నెఱుఁగఁదగినది.

అవ. నవాంశద్వాదశాంశస్వరూపం దర్శయతి.—

> మేషః కర్కటకస్తులా చ మకరః స్వస్వాదయో రాశయ
> స్స్వస్య స్వాత్మజధర్మయోశ్చ నవ తద్భాగా నవాంశాః క్రమాత్,
> యల్లగ్నం చ తదాదిసర్వనిలయాస్సద్వాదశాంశాః క్రమా
> త్తత్తద్రాశ్యధిపాస్తదంశపతయస్స్యుర్ద్వాదశాంశాభిధాః. 70

వ్యా. మేష ఇతి. మేషః కర్కటకస్తులా చ మకరః ఏతే చత్వారో రాశయస్స్వస్వాదయస్స్వస్వాస్స్వకీయా అంశా ఏవ ఆదయో యేషాం తే తథోక్తాః. న కేవల మేతావత్, స్వాత్మజధర్మయోశ్చ లగ్నాత్పంచమనవమయోశ్చ స్వస్య సంబంధినో అంశా ఏవ ఆదయో నవనవసంఖ్యాకాస్తద్భాగాః క్రమాత్ నవాంశా భవంతి, ఏతదుక్తం భవతి, మేషసింహధనుషాం మేషాంశ ఆదిః, కర్కటవృశ్చికమీనానాం కర్కటకాంశ ఆదిః, తులాకుంభమిథునానాం తులాంశఆదిః, మకరవృషభకన్యానాం మకరాంశ ఆదిః, లగ్నం యద్వర్తతే తదాదిసర్వనిలయాః తదాదిద్వాదశరాశయః ప్రసిద్ధా ద్వాదశాంశాః, తత్తద్రాశ్యధిపాస్తదంశపతయః తేషాం రాశీనాం యే అధిపాః తేషాం అంశానామపి త ఏవాధిపాః ద్వాదశాంశాభిధాస్సంజ్ఞాస్స్యుః.

అవ. నవాంశద్వాదశాంశస్వరూపములఁ జెప్పుచున్నాఁడు.—

తా. లగ్నఘటికల ౯ భాగములుచేసిన నవాంశ లని మేషసింహ ధనూరాసులకు మేషాదిగ నవాంశ గుణింపవలయు నని, కర్కటవృశ్చిక మీనములకు కర్కటకాంశ మొదలని, మకరవృషభకన్యలకు మకరాంశ మొద లని, తులాకుంభమిథునములకు తులాంశము మొద లని, లగ్నాధిపతియే నవాంశాధిపతి యని, యిది నవాంశక్రమమని, మఱియు ద్వాదశాంశ లనఁగా; లగ్నఘడియలు ౧౨ భాగములు చేయుట ద్వాదశాంశలని ఆయారాశ్యధిపతులే ద్వాదశాధిపతు లని తెలియవలెను.

అవ. త్రింశాంశాధిపతీనాహ.—

త్రింశాంశేష్వధిపాః కుజార్కిగురువిట్శుక్రాస్త్వయుగ్మే క్రమా
ద్బాణేష్వష్టమునీషవస్సమగృహే త్రింశాంశపా వ్యత్యయాత్,
షడ్వర్గస్త్వయమేవ సోఽపి శుభకృత్సౌమ్యగ్రహాణాం భవేత్
షడ్వర్గో యది పాపినాం నిధనకృత్సర్వేషు కర్మస్వపి. 71

వ్యా. త్రింశాంశేష్వితి. అయుగ్మే విషమరాశౌవిషయే, కుజార్కిగురువిట్శుక్రాః కుజశనిగురుబుధశుక్రాః, క్రమా త్రింశాంశేషు బాణేష్వష్టమునీషవః బాణేష్వష్టమునీషూణామిత్యర్థః. ఏతదంశానా మధిపతయః కుజః పంచాంశానాం, శనైశ్చరశ్చ పంచాశానాం, గురురష్టాంశానాం బుధస్సప్తాంశానాం, శుక్రః పంచాంశానా మధిపా ఇత్యాశయః. సమగృహేసమరాశిషుత త్రింశాంశపా, వ్యత్యయాత్ విలోమేన, జ్ఞేయా ఇతి శేషః. తథాహి.—శుక్రః పంచాంశానాం, బుధస్సప్తాంశానాం, గురురష్టాంశానాం, శనిః పంచాంశానాం, కుజశ్చ పంచాం శానాం, త్రింశాంశానా మధిపా ఇత్యర్థః. అయమేవ శ్లోకచతుష్టయప్రతిపాదిత లగ్నహోరాద్రేక్కాణ నవాంశద్వాదశాంశానాం షణ్ణాం సమాహారఏవ షడ్వర్గ ఇత్యుచ్యతే, సోఽపి, షడ్వర్గోఽపి, సౌమ్యగ్రహాణాం సంబంధీ చేచ్ఛుభకృ ద్భవేత్, పాపినాం క్రూరగ్రహాణాం, షడ్వర్గో యది సర్వేషు కర్మసు శుభ కర్మసు నిధనకృత్ మృత్యుప్రదః.

అవ. త్రింశాంశాధిపతులఁ జెప్పుచున్నాఁడు.—

తా. లగ్నము ౩౦ భాగములుచేసినఁ ద్రింశాంశలని, అందు అంగారక శనైశ్చరులై దైదంశలకును, గురువు ౮ అంశలకును, బుధుఁడేడంశ లకును, శుక్రుఁడు ౫ అంశలకును వీర లీక్రమము మేషాది బేసిరాసుల కధిపతు లనియును, వృషభాదిసమరాసులకు లగ్నము ౩౦ అంశ

ములలో శుక్రుఁడైదంశములకును, బుధుఁడేడంశములకును, గురువు ౮ అంశములకును, శనైశ్చరుఁడైదంశములకును, నంగారకుఁడు ౫ అంశములకును, వీరలు త్రింశాంశాధిపతులనియు, మఱియు నీపైనఁ జెప్పిన లగ్నహోరద్రేక్కాణ నవాంశద్వాదశాంశ త్రింశాంశ లనెడి షడ్వర్గము సకలకార్యములకు శుభగ్రహషడ్వర్గము శుభప్రదమనియు, పాపగ్రహ షడ్వర్గము మృత్యుప్రద మనియు నెఱుఁగ నగును.

అవ. షడ్వర్గవిభాగక్రమమాహ.—

త్రింశద్భాగమయంచలగ్నమితి సా హోరా తదర్ధంచ త
ద్ద్రేక్కాణస్తు తృతీయఏవ నవమోభాగో నవాంశః క్రమాత్,
తస్య ద్వాదశభాగ ఏవతు తత స్తద్ద్వాదశాంశ స్తత
స్త్రింశాంశ స్త్రిదశాంశ ఏవతు భవేత్షడ్వర్గ ఏవం క్రమః. 72

వ్యా. త్రింశద్భాగమయ మితి. త్రింశద్భాగమయం త్రింశద్భాగాత్మకం లగ్నమిత్యుచ్యతే. తదర్ధం లగ్నస్యార్ధం, పంచదశభాగాత్మకం సా హోరా పూర్వోక్తహోరేత్యుచ్యతే. తద్ద్రేక్కాణస్తు తృతీయఏవ దశభాగాత్మకః నవమోభాగః వింశతిలిప్తాధిక త్రిభాగాత్మకః నవాంశః, క్రమాద్భవతి,తస్య లగ్నస్య ద్వాదశభాగఏవ, సః ద్వాదశాంశః త్రింశల్లిప్తాధికద్విభాగాత్మకః. తత స్త్రిదశాంశఏవ త్రిరావృత్తా దశ త్రిదశ త్రింశాఇతి యావత్, తావంతో అంశాఏవ త్రింశాంశశ్చ భవేత్ షడ్వర్గ, ఏవం ఉక్తరీత్యా క్రమః మర్యాదా, బోధ్య ఇతి శేషః.

అవ. షడ్వర్గవిభాగక్రమమును జెప్పుచున్నాఁడు:—

తా. లగ్నము ౩౦ భాగములు గలదని, లగ్నార్ధము హోర యని, లగ్నత్రిభాగము ద్రేక్కాణ మని, లగ్ననవాంశము నవాంశ మని, లగ్న ద్వాదశాంశము ద్వాదశాంశ మని, లగ్నత్రింశాంశము త్రింశాంశ మనియు, ఇదే షడ్వర్గవిభాగక్రమంబు.

అవ. పుష్కరాంశవర్గోత్తమాంశానాహ:—

భూనేత్రేబ్ధివిధూజలాత్యగమితో మేషాదితః పుష్కర
స్సింహోదేర్ధనురాదికస్య చ తథా మీనాంతతస్త్వత్క్రమాత్,
షడ్వర్గో యది పంచవర్గ ఇతి వా వర్గోత్తమాంశ స్త్వయం
ప్రాజ్యధ్యశ్చరమశ్చరాదిషు నవాంశేషూత్తమా ద్యా శుభా. 73

వ్యా. భూనేత్రేతి. భూః ఏకః, నేత్రే ద్వే, వామాంకప్రక్షేపేణ ఏకవింశతి ర్భవతి సర్వత్ర సంఖ్యాప్రసంగే వామాంకప్రక్షేపో బోధ్యః, అబ్ధివిధూ అబ్ధయశ్చత్వారః విధురేకః చతుర్దశో భాగ ఇతియావత్, జలాక్షి జలంచత్వారః అక్షి ద్వే చతుర్వింశో భాగః, అగమితః సప్తపరిమితః, సప్తమో భాగ ఇతియావత్. మేషాదితః మేషవృషభ మిథునకర్కాటకానాం క్రమేణ పుష్కరః, మేషస్యైకవింశో భాగః, వృషభస్య చతుర్దశో భాగః, మిథునస్య చతుర్వింశో భాగః, కర్కాటస్య సప్తమో భాగ ఇతివివేకః. సింహాదేః, సింహకన్యాతులావృశ్చికానాం చతుర్ణాం క్రమాత్పూర్వవద్బోధ్యం, మీనాంతతః మీనావధికస్యేత్యర్థః. సార్వవిభక్తికస్తసిః. ధనురాదికస్య ధనుర్మకరకుంభమీనానామపి తథా పూర్వోక్తభాగ ఏవ క్రమాత్పుష్కరస్స్యాత్, షడ్వర్గో యది పుష్కరకాలే శుభగ్రహసంబంధిషడ్వర్గో భవతి. కదాచిచ్ఛుభగ్రహసంబంధిపంచవర్గో వా భవతి, చరాదిషు చరస్థిర ద్విస్వభావేషు రాశిషు ప్రాఙ్మధ్యశ్చరమశ్చ, వర్గోత్తమాంశాః, చరేషు ప్రథమాంశః, స్థిరేషు పంచమాంశః, ద్విస్వభావేషు నవమాంశః, వర్గోత్తమాంశ ఇత్యర్థః. నవాంశేషు ద్వౌ వృషభకర్కాటకాంశౌ శునవాంశత్వేన నిషిద్ధావపి ఉత్తమౌ వర్గోత్తమాంశౌ చేచ్ఛుభౌ శుభప్రదౌ, వృషభకటకయోః శుభగ్రహాధిపతిత్వాదితి భావః. మీనాంశస్య శుభగ్రహాధిపతిత్వేఽపి వర్గోత్తమాంశత్వేఽపి న శుభదః, ఝషమేషయోరతి గండాంతత్వేన వక్ష్యమాణత్వాత్.

అవ. పుష్కరాంశవర్గోత్తమాంశలఁ జెప్పుచున్నాఁడు:—

తా. మేషరాశిలో ౨౧-వ యంశమును, వృషభములో ౪-వ యంశమును, మిథునములో ౨౪-యంశమును, కటకములో ౭-వ యంశమును, సింహములో ౨౧-వ యంశమును, గన్యలో ౧౪-వ యంశమును, తులలో ౨౪-వ యంశమును, వృశ్చికములో ౭-వ యంశమును, ధనూరాశికి ౨౧-వ యంశమును, మకరరాశికి ౧౪-వ యంశమును, కుంభరాశికి ౨౪-వ యంశమును, మీనమునకు ౭-వ యంశమును పుష్కరాంశములనఁబడు. మఱియుఁ బుష్కరకాలమం దీచెప్పఁబడిన షడ్వర్గము శుభగ్రహసంబంధియైన శుభప్రద మనియు, శుభగ్రహసంబంధియైనఁ బంచవర్గమైన శుభప్రద మనియు, వర్గోత్తమాంశలనఁగా; చరలగ్నములయందుఁ బ్రథమాంశలును స్థిరలగ్నములందుఁ బంచమాంశములును ద్విస్వభావలగ్నములయందు నవమాంశములు నివి వర్గోత్తమాంశలు. (నవాంశములందు వృషభ కర్కటకాంశములకు నవాంశము లోటవలన [illegible]షిద్ధములైనను రాసులకు శుభగ్రహాధిపతిత్వము లుండుటవలన

శుభప్రద మని మీనాంశమునకు శుభగ్రహాధిపతిత్వముండి వర్గోత్తమాంశమైన నతిగండాంత మాటచేత నిషేధింపఁబడి యుండుటవలన నశుభప్రదము.)

అవ. వృషభకర్కటకాంశయో ర్వర్గోత్తమాంశత్వేన శుభప్రదత్వం నిరూప్య ఇదానీమవశిష్టానాం చతుర్ణాం పుష్కరాంశత్వేన శుభప్రదత్వం నిరూపయ న్నన్యేషాం కునవాంశత్వం దర్శయతి:—

కన్యాయుగ్మతులాంశకా అపి ధనుః ప్రాగర్ధభాగశ్శుభా
ఏతే భాగ్యసుతార్థదా న చరమా వర్గోత్తమాంశం వినా,
నైవాహ్యాష్టమరాశిభాగఉభయోర్ద్వా ద్వాదశాంశ స్తథా
తేభ్యోఽన్యే కునవాంశకా అపి శుభం ప్రాహుర్వృషాంశం పరే. 74

వ్యా. కన్యేతి. కన్యాయుగ్మతులాంశకాః ధనుః ప్రాగర్ధభాగోఽపి పూర్వార్ధభాగశ్చ ఏతే శుభాః చతురంశాః, భాగ్యసుతార్థదాః సౌభాగ్యపుత్రసంపత్కరాః నచరమాః ఏతేషామేవ అంశాః రాశ్యంతర్గతాశ్చేన్న యోగ్యాః, వర్గోత్తమాంశం వినా. వర్గోత్తమాంశస్తు రాశ్యంతర్గతోఽపి శుభఏవ, ఉభయోర్దంపత్యోః అష్టమరాశిభాగోఽపి న శుభదః తథా తయోర్ద్వాదశాంశోఽపి న యోగ్యః, తేభ్యోఽన్యే కన్యాయుగ్మతులాధనుః పూర్వార్ధేభ్యః అన్యే నవాంశాః కునవాంశాః కుత్సితనవాంశాః అశుభనవాంశా ఇతియావత్. వృషాంశం వృషభాంశమపి శుభమితి పరే ప్రాహుః.

అవ. వర్గోత్తమాంశము లౌటవలన వృషభకర్కటకాంశలకు శుభప్రదత్వమును నిరూపణచేసి, మిగిలిన కన్యా మిథున తులా ధనుస్సును పుష్కరాంశ లౌటచేత వీనికిని శుభప్రదత్వము నిరూపణచేయుచు నితరాంశలకు కునవాంశత్వముఁ దెలియఁ జేయుచున్నాఁడు:—

తా. కన్యా మిథున తులాంశలును ధనుఃపూర్వభాగమును సౌభాగ్యపుత్రసంపత్ప్రదము లనియు, నీచరాసులచరమాంశలు శుభప్రదములు గావనియు, వర్గోత్తమాంశము రాశ్యంతర్గతమైనను శుభప్రదమనియు, దంపతులకు నష్టమరాశిభాగమును ద్వాదశాంశమును శుభప్రదములు గావనియుఁ, గన్యామిథున తులా ధనుఃపూర్వభాగములకంటె నితరములైనయంశలు కునవాంశ లని కొందఱియభిప్రాయము, వృషభాంశము శుభము.

అవ. శ్లోకద్వయేన నవాంశ ప్రత్యేక ఫలమాహ:—

మేషాంశే చ విభర్తృకా పశుగణా కన్యా వృషాంశే భవే
ద్యుగ్మాంశే ధనపుత్రిణీ చ కులటా స్యాత్కర్కటాంశే ఖలా,
సింహాంశే పితృసద్మగాఽథ సుగుణా విత్తార్జితాచ స్త్రియా
స్సత్పుత్రా చ తులాంశకే చ సుగుణా నిస్స్వాంశకే చాలినః. 75

వ్యా. మేషాంశ ఇతి. మేషాంశే కృతపరిణయా కన్యా, విభర్తృకా విధవా భవేత్, వృషాంశే వృషభాంశే పరిణతా చేత్పశుగణా పశుసంపన్నా భవేత్, యుగ్మాంశే ధనపుత్రిణీ ధనవతీ పుత్రవతీచ, కర్కటాంశే కులటా వ్యభిచారిణీ.—'కులటా పాంసులాచ స్యా'దిత్యమరః. ఖలా దుష్టాచ స్యాత్, సింహాంశే పితృసద్మగా విధవా భవేత్, అథ స్త్రియాః కన్యాయాః అంశే సుగుణా సౌశీల్యాదిగుణవతీ విత్తార్జితాచ, తులాంశే సత్పుత్రా సుగుణాచ భవతి, అళినః అంశే వృశ్చికాంశే, నిస్స్వ దరిద్రా స్యాత్.

అవ. రెండు శ్లోకములచేత నవాంశలకుఁ బ్రత్యేక ఫలములఁ జెప్పుచున్నాఁడు:—

తా. మేషాంశమందు వివాహమైనకన్యక విధవయగుననియు, వృషభాంశమం దైనకన్యక పశుసమృద్ధిగల దగు ననియు, మిథునాంశమందైన స్త్రీ ధనవతియుఁ బుత్రవతియునగు ననియు, కర్కటాంశ మందైన స్త్రీ వ్యభిచారిణి యగు ననియు, సింహాంశమందు విధవయుఁ, కన్యాంశమం దైన స్త్రీ సుగుణవతియు ధనవతియు నగుననియుఁ, తులాంశమందు సుపుత్రులు గలదగుననియు,వృశ్చికాంశమందు దరిద్రురాలగునని తెలియునది.

చాపాంశాదిమభాగ ఏవ ధనినీ భాగేఽన్యసక్తాఽపరే
దుశ్శీలాచ మృగాంశకే గతధవా కుంభాంశకే రుగ్మిణీ,
మీనాంశే పతిపుత్రభాగ్యవియుతా లగ్నాన్నవాంశో బలీ
షడ్వర్గస్థనవాంశకే చ గదితం యద్యత్తదత్రాపి చ. 76

వ్యా. చాపాంశేతి. చాపాంశాదిమభాగే ధనురంశాద్యభాగ ఏవ, ధనినీ ధనవతీ, అపరే భాగే ఉత్తరార్ధే, అన్యసక్తా పరాధీనా, వ్యభిచారిణీతి యావత్. కించ దుశ్శీలా దురాచారవతీ స్యాత్, మృగాంశకే మకరాంశే, గతధవా విధవా, కుంభాంశకే రుగ్మిణీ రోగవతీ,మీనాంశే పతిపుత్రభాగ్యవియుతా విధవా సంతానహీనా దరిద్రాచ స్యాత్, లగ్నాన్నవాంశః లగ్నాపేక్షయా నవాంశఏవ బలీ శ్రేష్ఠః, షడ్వర్గస్థనవాంశకే యత్ఫలం గదితం ఉక్తం, అత్రాపి శుభషడ్వర్గస్థనవాంశకేఽపి తద్వత్ తాదృక్ఫలమేవ. అనేన శుభనవాంశమాత్రస్య యోగ్యత్వం గమ్యతే, లగ్నాన్నవాంశో బలీత్యుక్తత్వాత్.

తా. ధనురంశపూర్వభాగమందైన స్త్రీ ధనవంతురాలును, అపరాంశమందైన వ్యభిచారిణియు దురాచారవతియు నగును. మకరాంశమందైన స్త్రీ విధవయు, కుంభాంశమందు రోగవతియు, మీనాంశమందైన విధవయు నపుత్రవతియు దరిద్రురాలు నగును. లగ్నమునకంటె నవాంశము బలవత్తర మని చెప్పుటవలన శుభనవాంశము సౌభాగ్యము.

అవ. కుజాష్టమభృగుషట్కదోషానాహ.—

లగ్నాదష్టమగః కుజో నిధనకృద్భౌమాష్టమాఖ్యోఽప్యయం
యద్యేవం భృగుషట్కదోష ఇతి తల్లగ్నాద్భృగుష్షష్ఠగః,
యుద్ధే శత్రుజితౌ రిపోర్గృహగతౌ నీచస్థితౌ చాస్తగౌ
తౌ ద్వౌ దుర్బలినౌ వదంతి చ పరే దోషస్తు నాస్తీత్యహో. 77

వ్యా. లగ్నాదితి. కుజోఽంగారకః, లగ్నాదష్టమగతః అష్టమస్థానగతో యది, నిధనకృత్ మృత్యుప్రదః. అయమేవ భౌమాష్టమాఖ్యః కుజాష్టమదోష ఇత్యుచ్యతే. ఏవ మేవ తల్లగ్నాత్ ప్రకృతశుభలగ్నాత్, భృగుశ్శుక్రః, షష్ఠగః షష్ఠగో యది, భృగు షట్కదోష ఇత్యుచ్యతే. ఫలం తు పూర్వోక్తమేవ. తౌ ద్వౌ కుజశుక్రౌ, యుద్ధే గ్రహయుద్ధే, శత్రుజితౌ శత్రుతిరస్కృతౌ వా, రిపోర్గృహగతౌ శత్రుక్షేత్రగతౌ వా, నీచస్థితౌ నీచక్షేత్రగతౌ వా, అస్తగౌ సూర్యసహితకిరణౌ వా యది, దుర్బలినౌ బలహీనౌ, భవతః దోషస్తు భృగుషట్కాది దోషస్తు నాస్తీతి పరే వదంతి. అహో ఇత్యాశ్చర్యే.

అవ. కుజాష్టమభృగుషట్కదోషములఁ జెప్పుచున్నాఁడు.—

తా. అంగారకుఁడు వివాహలగ్నమునకు ౮-ట నుండిన మృత్యుప్రదుఁడు. ఇదియే కుజాష్టమదోష మనఁబడును. మఱియు నీ శుభలగ్నమునకు ౬-ట శుక్రుఁ డుండిన భృగుషట్కదోషము. దీనికిఁ బైనఁ జెప్పినఫలమే. కుజశుక్రులు గ్రహయుద్ధమందు శత్రువుచేత జయింపఁ బడినను, తిరస్కరింపఁ బడినను, శత్రుక్షేత్రముల నీచక్షేత్రములను పొందినను, అస్తమానమును బొందియుండినను, బలరహితు లగుటవలన దోషములే దని కొందఱియభిప్రాయము. ఆయభిప్రాయము గ్రంథకర్తకు నత్యాశ్చర్య మనుట.

అవ. కర్తరీదోషమాహ.—

లగ్నాద్ద్వాదశగో భవేదృజుగతిర్వక్రీ ద్వితీయస్థితః
పాపౌ ద్వౌ యది మధ్యలగ్నముభయోర్మృత్యుప్రదా కర్తరీ,

చంద్రో వా యది మధ్యగ స్తదుభయోరన్యే జగుః కర్తరీ
తౌ ద్వౌ వా న చ కర్తరీ హ్యృజుగతీ తద్వ్యత్యయా వక్రిణౌ. 78

వ్యా. లగ్నాదితి. ద్వౌ ద్విత్వసంఖ్యావచ్ఛిన్నౌ, పాపౌ పాపగ్రహౌ, తిష్ఠతః. తదుభయోః పాపగ్రహయోః, ఏకః లగ్నాత్ ద్వాదశగస్సన్, ఋజుగతిః అన్యో వక్రీ సన్ ద్వితీయస్థితః లగ్నాద్ద్వితీయస్థానగతో భవేద్యది, ఉభయోః ద్వాదశద్వితీయయోః మధ్యలగ్నం యత్తస్య, తదా లగ్నస్య కర్తరీ కర్తరీనామ దోషః. సా కర్తరీమృత్యుప్రదా, చంద్రః తదుభయోః పాపగ్రహయోః మధ్యగో వా యది కర్తరీత్యన్యే జగుః ఊచుః. తచ్చింత్యం. చింతాబీజం తు చంద్రః సపాదదినద్వయ మేకస్మిన్ రాశౌ తిష్ఠతి తావచ్ఛుభకర్మప్రసంగనిషేధః స్యాదితి, తౌ ద్వౌ పాపగ్రహౌ, ఋజుగతీ వా ద్వావపి వక్రిణౌ వా, వ్యత్యయా ద్వాదశగో వక్రీ ద్వితీయగో ఋజుగతిర్వా యది తదా కర్తరీ దోషో నాస్తి.

అవ. కర్తరి యనుదోషమును జెప్పుచున్నాఁడు.—

తా. రెండుపాపగ్రహములలో నొకపాపగ్రహము లగ్నమునకు ౧౨-ట వక్రింపకయుండి మఱియొక పాపగ్రహము లగ్నమునకు ౨-ట వక్రించియుండెనేని యీ రెంటిమధ్యమున నున్నలగ్నమునకుఁ గర్తరి యనుదోషము వచ్చును. ఈదోషము మృత్యుప్రదము. కొందఱు రెండుపాపగ్రహములనడుమ చంద్రుఁ డుండెనేని యది కర్తరిదోషమని చెప్పుచున్నారు. ఈ చెప్పఁబడిన పాపగ్రహములు రెండును వక్రించి యున్నను, వక్రవర్జితులై యున్నను లగ్నద్వాదశమందు వక్రించియుండి లగ్నద్వితీయమందు వక్రరహితులై యున్న నీ చెప్పఁబడిన కర్తరి దోషము లేదు.

అవ. అష్టమలగ్నదోషమాహ.—

త్యాజ్యం చాష్టమలగ్న మేవ జననాల్లగ్నాచ్చ రాశే స్తయో
ర్దంపత్యోరపి మృత్యుకృ త్తదధిపో లగ్నస్థితో వా తయోః,
చంద్రోఽప్యష్టమరాశిగ స్తదుభయోర్నిత్యం దరిద్రప్రద
స్త్యాజ్యం ద్వాదశలగ్నమప్యశుభకృ త్తజ్జన్మ లగ్నం గృహమ్. 79

వ్యా. త్యాజ్యమితి. జననాల్లగ్నాత్ జన్మలగ్నాత్, రాశేః జన్మకాల చంద్రరాశేశ్చ, అష్టమలగ్నం యత్తత్, తయోర్దంపత్యోర్మృత్యుకృత్. అతోఽష్టమ

లగ్నం త్యాజ్య మేవ దంపత్యోరితి ప్రకరణబలాదుపన్యస్తమ్. షష్ఠేశామప్యష్టమ లగ్నం త్యాజ్యమిత్యవధేయమ్. త్యాజ్యమిత్యేవకారేణ గుణయుక్తమపి త్యాజ్య మితి గమ్యతే. 'అష్టమం తు న కర్తవ్యం యది సర్వగుణాన్విత'మితి దైవజ్ఞవిలాసాదిగ్రంథేషు జాగరూకత్వాత్. తదధిపః అష్టమలగ్నాధిపః, లగ్నగతో వా వివాహాదిలగ్నగతో వా యది, తయోర్దంపత్యోర్మృత్యుకృద్భవతి, కిం చ చంద్రోఽష్టమరాశిగః జన్మరాశేరష్టమరాశిగతో యది, తదుభయోర్నిత్యం దరిద్రప్రదః. ద్వాదశలగ్నమపి, జన్మలగ్నజన్మరాశ్యోః ద్వాదశలగ్నమపి త్యాజ్యం, తజ్జన్మలగ్నం తయోర్దంపత్యోర్జన్మకాలలగ్నమప్యశుభకృత్, కించ గృహం తయోర్జన్మరాశిరప్యశుభకృత్. అత్రాయం విశేషః, యస్మిన్ గృహే యస్య జన్మ తత్తస్య జన్మగృహం, తస్మిన్వివాహాదివేదికానాం న యోగ్యమితి.

అవ. అష్టమలగ్న దోషమును జెప్పుచున్నాఁడు.—

తా. జన్మ లగ్నమునకును జననకాలచంద్రరాశికి ౮-వ లగ్నము మృత్యుప్రదమౌటవలనను నాలగ్నము గుణయుక్తమైనదైనను నిషేధింపవలయును. అష్టమలగ్నాధిపతి వివాహాదిలగ్నములఁ బొందెనేని దంపతులకు మృత్యుప్రదుఁడును, చంద్రుఁడు జన్మరాశికి ౮-వ రాశిని బొందియున్న దంపతులకు నిత్యదారిద్ర్యప్రదుఁడును అగును. జన్మద్వాదశలగ్నమును స్వజన్మలగ్నము నశుభకరము. మఱి జన్మగృహ మనఁగా, నేయింటఁ బుట్టినవాని కాయిల్లు జన్మగృహము. జన్మగృహము వివాహాదులకు యోగ్యముగాదు.

అవ. షష్ఠాష్టరిప్ఫచంద్ర సగ్రహదోషానాహ.—

లగ్నాద్ద్వాదశగేఽథవా రిపుగతే చంద్రేఽష్టమస్థే తథా
రిష్ఫాష్టారిగచంద్రనామకమహాదోష స్తయోర్మృత్యుకృత్,
దోషస్సగ్రహనామకో నిధనకృచ్చంద్రే గ్రహేణాన్వితే
దోషో నేతి పరే జగుశ్శశధరే సౌమ్యగ్రహేణాన్వితే. 80

వ్యా. లగ్నాదితి. చంద్రే లగ్నాత్ ద్వాదశగే ద్వాదశరాశౌ స్థితే సతి, అథ వా రిపుగతే లగ్నాత్ షష్ఠస్థానగతే వా, అష్టమస్థే వా యది, తదా రిష్ఫాష్టారిగచంద్రనామకమహాదోషో భవతి, స దోష స్తయోర్దంపత్యోర్మృత్యుకృత్, చంద్రే గ్రహేణాన్వితే శుభగ్రహేణ పాపగ్రహేణ వా యుక్తే సతి, తదా సగ్రహానామకో దోషః దంపత్యోర్నిధనకృత్, శశధరే చంద్రే, సౌమ్యగ్రహేణాన్వితే సతి దోషో నాస్తీతి పరే జగుః.

అవ. షష్ఠాష్టరిష్ఫచంద్రసగ్రహదోషములను జెప్పుచున్నాఁడు.—

తా. చంద్రుఁడు వివాహాదిలగ్నమునకు ౬-౮-౧౨ ట నుండినపుడు రిష్ఫాష్టారిగచంద్రనామకదోషము. ఆదోషము దంపతులకు మృత్యుప్రదము. చంద్రుఁడు శుభగ్రహములతోఁగాని పాపగ్రహములతోఁగాని కూడియుండుటయే సగ్రహనామక దోషమగును. ఆదోషము దంపతులకు నిధనప్రదము. మఱియు చంద్రుఁడు శుభగ్రహములతోఁ గూడియున్నప్పు డీదోషము లేదని కొందఱి యభిప్రాయము.

అవ. సూర్యాదియుక్తచంద్రసగ్రహస్య ప్రత్యేకఫలాన్యాహ.—

దారిద్ర్యం మరణం త్వపత్యరహితం దౌర్భాగ్యమేవం స్త్రియా
స్సాపత్న్యం యతిభావమేవ కలహం దుఃఖం చ కుర్యాత్క్రమాత్,
ఉద్వాహాదిషు చంద్ర ఏకభవనే సూర్యాదిఖేటైర్యుతో
నక్షత్రాంతరగశ్శుభో యది శశీత్యన్యే జగుర్నేతరే. 81

వ్యా. దారిద్ర్యమితి. చంద్రః ఉద్వాహాదిషు వివాహాదిషు, సూర్యాదిఖేటైః సూర్యాదిగ్రహైః, యుతః సహితస్సన్, ఏకభవనే ఏకరాశౌ స్థితశ్చేత్, క్రమాదిదం ఫలం కుర్యాత్; యథా.—చంద్రస్సూర్యయుక్తశ్చేత్ స్త్రియాః కన్యాయాః, దారిద్ర్యం కుర్యాత్, అంగారయుక్తశ్చేన్మరణం, బుధయుక్తశ్చేదపత్యరహితం సంతానాభావం, గురుయుక్తశ్చేద్దౌర్భాగ్యం, భృగుయుక్తశ్చేత్సాపత్న్యం సపత్నీత్వం, శనియుక్తశ్చేద్యతిభావం, రాహుయుక్తశ్చేత్కలహం, కేతుయుక్తశ్చేద్దుఃఖం కుర్యాత్. శశీచంద్రః ఏకరాశిగతోఽపి, నక్షత్రాంతరగో భిన్ననక్షత్రగతో యది, శుభశ్శుభప్రద ఇత్యన్యే జగుః, అపరే నేతి భిన్ననక్షత్రగతోఽపి న శుభ ఇత్యూచుః.

అవ. సూర్యాదియుక్తచంద్రసగ్రహమునకుఁ బ్రత్యేకఫలములఁ జెప్పుచున్నాఁడు.—

తా. చంద్రుఁడు వివాహాదివిషయమై యేకరాశియందు సూర్యునితోఁగూడియుండినచో వివాహమైనస్త్రీకి దారిద్ర్యప్రదుఁడును, అంగారకునితోఁగూడియున్న మరణప్రదుఁడును, బుధునితోఁగూడిన స్త్రీని బుత్రహీనురాలుగాఁ జేయువాఁడును, బృహస్పతితోఁగూడిన దౌర్భాగ్యప్రదుఁడును, శుక్రునితోఁగూడినస్త్రీకి సపత్నీప్రదుఁడును, శనైశ్చరునితోఁ గూడిన నైశ్వర్యాభావప్రదుఁడును, రాహువుతోఁగూడినఁ గలహప్రదుఁడును, కేతువుతోఁగూడిన దుఃఖప్రదుఁడు నగును. మఱి వివాహాది

విషయమై చంద్రుఁడొక రాశియందు సూర్యాదిగ్రహములతోఁగూడినను నక్షత్రభేదము గలిగియున్నను శుభకరుఁ డని కొందఱయభిప్రాయము. నక్షత్రాంతరగతుఁడైన నశుభకరుఁ డని మఱికొందఱి యిష్టము.

అవ. అథ శ్లోకద్వయేన వారజనితదుర్ముహూర్తదోషమాహ.—

రుద్రాఖ్యోరగమిత్రపిత్ర్యవసవో వారాఖ్యవిశ్వేవిధి
బ్రహ్మేంద్రేంద్రహుతాశదైత్యవరుణా అప్యర్యమాఖ్యో భగః,
ఏతే పంచదశక్రమాత్తు దివసే జ్ఞేయా ముహూర్తా భగ
శ్చేంద్రాగ్నీ అహిదైత్యరౌద్రపితరస్త్యాజ్యాస్తు శేషాశ్శుభాః. 82

వ్యా. రుద్రేతి. రుద్రాఖ్య ఏకః, ఉరగాఖ్యో ద్వితీయః, మిత్రాఖ్యస్తృతీయః, పిత్ర్య ఇతి చతుర్థః, వస్వాఖ్యః పంచమః, వారాఖ్యష్షష్ఠః, విశ్వేదేవాఖ్యస్సప్తమః, విధ్యాఖ్యోఽష్టమః బ్రహ్మాఖ్యో నవమః, ఇంద్రాఖ్యో దశమః, ఇంద్రహుతాశనాఖ్యో ద్విదైవత్య ఏకాదశః. దైత్యాఖ్యో ద్వాదశః, వరుణాఖ్యస్త్రయోదశః, అర్యమాఖ్యశ్చతుర్దశః, భగ ఇతి పంచదశః, ఏతే పంచదశముహూర్తాః, క్రమాద్దివసే ప్రతిదివసే, జ్ఞేయాః జ్ఞాతవ్యాః, తేషాం ప్రయోజనమాహ:—భగః పంచదశః, ఇంద్రాగ్నీ ఏకాదశః, అహిః ఉరగాఖ్యో ద్వితీయః, దైత్యో ద్వాదశః రౌద్రః ప్రథమః, పిత్రాఖ్యశ్చతుర్థశ్చ, ఏతే షణ్ముహూర్తాః ఉగ్రదైవత్యా, త్యాజ్యాః, శుభకర్మస్వితి శేషః. శేషా నవ ముహూర్తాః శుభాః.

అవ. రెండుశ్లోకములచేత వారజనితదుర్ముహూర్తదోషమును జెప్పుచున్నాఁడు.—

తా. మొదటిది రుద్రముహూర్తమనియు, రెండవది యురగముహూర్తమనియు, మూఁడవది మిత్రమనియు, నాలవది పిత్ర్యమనియు, నైదవది వసువనియు, నాఱవది వారమనియు, నేడవది విశ్వేదేవమనియు, నెనిమిదనది విధియనియుఁ, దొమ్మిదవది బ్రహ్మయనియుఁ, బదియవది యింద్రముహూర్తమనియుఁ, బదునొకొండవది యింద్రహుతాశనమనియుఁ, బండ్రెండవది దైత్యమనియుఁ, బదుమూఁడవది వరుణమనియుఁ, బదునాలవది యర్యమమనియుఁ, బదునైదవది భగముహూర్తమనియు, నీచెప్పిన పంచదశముహూర్తములు ప్రతిదివసమం దీక్రమమునఁ దెలియవలయు. అందు భగ, ఇంద్రహుతాశన, ఉరగ, దైత్య, రౌద్ర, పిత్ర్యముహూర్తములు ఉగ్రదైవత్యము లవుటవలన శుభకర్మముల విషయమై నిషిద్ధములు. మిగిలిన తొమ్మిది ముహూర్తములును శుభప్రదములు.

రాత్రౌ పంచదశేశ్వరాజచరణాహిర్బుధ్న్యపూషాభిధా
నాసత్యాంతకవహ్ని ధాతృశశినశ్చాదిత్యజీవాచ్యుతాః,
అర్కత్వష్టృసమీరణాశ్శుభవిధౌ చత్వార ఏవాశుభా
రౌద్రాజాంఘ్రియమాగ్నయో యదుడుపో యస్మిన్ క్షణే యత్ఫలమ్.

వ్యా. రాత్రావితి. ఈశ్వరః, అజచరణః, అహిర్బుధ్న్యః పూషా నాసత్యః, అంతకః, వహ్నిః, ధాతా, శశీ, ఆదిత్యః, జీవః, అచ్యుతః, అర్కః, త్వష్టా, సమీరణః, ఇత్యేతత్సంజ్ఞాః పంచదశ ముహూర్తాః రాత్రౌ జ్ఞేయాః. పంచదశ ముహూర్తానాం మధ్యే రౌద్రాజాంఘ్రియమాగ్నయ ఇత్యేతే చత్వార ఏవ ముహూర్తాః, శుభవిధౌ శుభకర్మణి, అశుభాః, శేషాస్తు శుభా ఏవ. యదుడుపో యస్మిన్ క్షణే యత్ఫలం యాదృశఫలం యథాతథా దదాతి, తద్వత్తన్ముహూర్తాధిపాః స్వానురూపం ఫలం దదతి, యథా రుద్రాఖ్యస్య రుద్రాధిపః రౌద్రఫలం దదాతి. ఏవమన్యత్రాప్యూహ్యం, యద్వా యస్మిన్ నక్షత్రే యత్కర్మోక్తం తద్దైవత్యముహూర్తేఽపి తత్కార్యమిత్యర్థః. యథా అనూరాధాయాం వివాహ ఉక్తః తస్యాః మిత్రదేవతాకత్వాత్ మిత్రముహూర్తే వివాహః కార్యఇతి. ఏవమన్యత్రాప్యూహ్యం, తథా చ రత్నమాలాయాం.—'యస్మిన్ ధిష్ణ్యే యచ్చ కర్మోపదిష్టం తద్దైవత్యే తన్ముహూర్తేఽపి కార్య' మితి. తస్మాదుగ్రదైవత్యాస్త్యాజ్యా ఇత్యర్థః.

తా. ప్రతిరాత్రియందును బంచదశ ముహూర్తములలో మొదటిది యీశ్వరముహూర్తమనియు, రెండవది యజచరణమనియు, మూఁడవది యహిర్బుధ్న్యమనియు, నాలవది పూషమనియు, నైదవది నాసత్యమనియు, నాఱవది యంతకమనియు, నేడవది వహ్నియనియు, నెనిమిదవది ధాతయనియుఁ, దొమ్మిదవది శశియనియుఁ, బదియవది యాదిత్యమనియుఁ, బదునొకండవది జీవమనియుఁ, బంద్రెండవది యచ్యుతమనియుఁ, బదుమూఁడవది యర్కమనియుఁ, బదునాలవది త్వష్ట యనియుఁ, బదునైదవది సమీరణముహూర్తమనియు నీ పంచదశ ముహూర్తములలో రుద్ర, అజాంఘ్రి, యమ, అగ్ని యీనాలుగుముహూర్తములును శుభకర్మలవిషయమై యుగ్రము లౌటవలన నిషేధింపవలయుననియు, నేనక్షత్రాధిపతి ఏయేక్షణమం దెంతమాత్రము ఫలము నిచ్చుచున్నాఁడో యాప్రకార మీముహూర్తాధిపతులును దమతమస్వరూపమునకుఁ దగినఫలముల నిచ్చుచున్నారనియు, నేనక్షత్రమం దేకర్మ

యుట శ్రేష్ఠమని చెప్పియున్నదో యా నక్షత్రాధిదేవతముహూ
ర్తమునందును శుభకర్మము చేయుట ముఖ్య మనియు నెఱుంగనగు.

ఆదిత్యేఽర్యమనామక శ్శశిదినే బ్రహ్మాసురాఖ్యౌ కుజే
పిత్ర్యాఖ్యానలసంజ్ఞితౌ బుధదినే స్యాచ్చేన్ముహూర్తోఽభిజిత్,
దైత్యాహ్వా గురువాసరే భృగుదినే బ్రాహ్మాఖ్యపిత్ర్యౌ శనౌ
రౌద్రాహీ త్వఖిలే శుభే నిధనదాస్తే దుర్ముహూర్తాః క్రమాత్. 84

వ్యా. ఆదిత్య ఇతి. ఆదిత్యే ఆదిత్యవాసరే, అర్యమనామకశ్చతుర్దశో ముహూర్తః, శశిదినే సోమవాసరే, బ్రహ్మా నవమః, అసురో ద్వాదశో ముహూర్తః, కుజవాసరే పిత్ర్యాఖ్యశ్చతుర్థః అనలసంజ్ఞికః రాత్రౌ సప్తమశ్చ ద్వౌ. బుధదినే అభిజిత్ అష్టమో ముహూర్తః. గురువాసరే దైత్యాహ్వా దైత్యో ద్వాదశః అహః ... రాఖ్యష్షష్ఠశ్చ. భృగుదినే బ్రాహ్మాఖ్యపిత్ర్యౌ నవమచతుర్థౌ శనౌ శనివాసరే, రౌద్రాహీ ప్రథమ ద్వితీయౌ ముహూర్తౌ, ఏతే ద్వాదశముహూర్తాః క్రమాన్నిధనదాః. అత అఖిలే శుభే అఖిలశుభకర్మసు, త్యాజ్యా ఇత్యర్థః.

తా. ఆదివారమం దర్యమ మనెడి నామముగల పదునాలవముహూర్తమును, సోమవారమందు బ్రహ్మమను తొమ్మిదవముహూర్తమును, అసురమనెడి పండ్రెండవముహూర్తమును, కుజవారమునందు పగలు పిత్ర్యమను నాలవముహూర్తమును, రాత్రి యేడవదగు ననలముహూర్తమును, బుధవారమం దభిజిత్తను నెనిమిదవ ముహూర్తమును, గురువారమందుఁ బండ్రెండవదగు దైత్యమును, వార మను పేరుగల యాఱవముహూర్తమును, శుక్రవారమందు బ్రహ్మమను తొమ్మిదవముహూర్తమును, పిత్ర్యమను నాలవముహూర్తమును, శనివారమందు రుద్ర, అహి అను ప్రథమద్వితీయముహూర్తములును నీచెప్పిన ౧౨ ముహూర్తములు నుగ్రములౌటవలన శుభకర్మలయందు నిషేధింపవలయును.

అవ. కాలహోరామాహ.—

యద్వారే చ యదిష్టకాలఘటికాద్విఘ్న్యాశ్శరాప్తాగతాః
పూర్ణాంశా అథ వర్తమానసమయస్స్యాత్కాలహోరా క్రమాత్,
వారేశాదిరవిర్భృగుర్బుధవిధూ మందో గురుర్మంగళ
శ్చేత్యాప్రగ్రహాః కాలహా నిధనదాస్త్యాజ్యా వివాహాదిషు. 85

వ్యా. య ఇతి. యద్వారే చ యస్మిన్నవసరే, యదిష్టకాలఘటికాః తాః ద్విఘ్నాః ద్వాభ్యాం గుణితాః, తా ఏవ శరాప్తాః పంచభిర్విభక్తాస్సత్యః అగతాః అబ్ధాః శరాప్తేభ్య ఆగతా ఇత్యర్థః. పూర్వాంశాః గతహోరాః, అథ వర్తమాన సమయః యచ్ఛిష్టం తద్వర్తమానఘోరాక్రమాత్ కాలహోరా స్యాత్. వారేశాది యస్య వారస్యయోఽధిపః తదాది, రవిర్భృగుర్బుధో విధుర్మందో గురుః, మంగళోఽంగారకశ్చ, ఏతే ఉదయాదారభ్య క్రమేణ పునఃపునః హోరాధిపా భవంతి, కేచిత్తు అర్ధరాత్రమారభ్యహోరా గణనా కర్తవ్యేత్యాహుః. అత్రాయం విశేషః.-సార్ధఘటికాద్వయాత్మికాయాః హోరాయాః పంచార్ధనాడికా భవంతి, తాసామర్ధనాడికానాం క్రమేణ రవిశశికుజబుధగురవోఽధిపాః, తతః శుక్రహోరాయాః పంచార్ధనాడికానాం క్రమేణ బుధగురుశుక్రశనిసూర్యా అధిపా భవంతి, ఏవం సర్వాసాం యోజనీయాః. అతః హోరాధిపతే షష్ఠగ్రహః తదనంతరహోరాధిపో భవతి. ఏతా హోరాః పాపగ్రహకాలజాతాశ్చేన్నిధనదాః, అతో వివాహాదిషు త్యాజ్యాః. భూరేఖాధ్వయోజనేషు తచ్చతుర్థభాగం త్యక్త్వా భూరేఖాయాః ప్రాగ్దేశస్థైస్తేషు పునః పంచదశఘటికా శోధ్యాః. రేఖాయాః ప్రత్యగ్దేశస్తు తేషు పునః పునః పంచదశఘటికా యోజ్యా యది తేషు పంచదశఘటికా న శోధ్యాః. తథా పంచదశఘటికాస్వేవ తాశ్శోధ్యాః. తాసు దినార్ధే శోధితాసు సతీషు యావానవశిష్టో భవతి సూర్యోదయోపరి తావద్ఘటికామారభ్య వారప్రవృత్తిర్యది దినార్ధేన శోధ్యాః. తదా దినార్ధాద్యావదతిరిచ్యతే తదారభ్య సూర్యోదయాత్పూర్వం వారప్రవృత్తిః. ఉక్తంచ రత్నమాలాయామ్.—'వారప్రవృత్తిం మునయో వదంతి సూర్యోదయాద్రావణరాజధాన్యామ్, ఊర్ధ్వం తథాధోఽప్యపరత్ర తస్మాచ్చరార్ధదేశాంతరనాడికాభిః.'

అవ. కాలహోరక్రమమును జెప్పుచున్నాఁడు.—

తా. ఏవారమందైనను హోర నిర్ణయించుపట్టున నుదయము మొదలైనగడియలను రెట్టించి ౫-టఁ భాగింపఁగా మిగిలినది తత్కాల హోర యగును. ఏవారమందు హోరచూచిన నావారాధిపతి మొదటి హోరాధిపతి. మొదటి హోరాధిపతికి ౬-వ గ్రహము వెంబడి హోర యనియు, దినము ౧-కి ౧౨ హోరలకు నధిపతులనియు, నిందుకు నుదాహరణ మాదివారమందు హోర చూచినపక్షమందు సూర్యుఁడు మొదటి హోరాధిపతియనియు, భృగు బుధ చంద్ర శని గురు అంగారకు లీక్రమమున నుదయము మొదలు పలుమాఱు హోరాధిపతులనియుం దెలియవలెను. కొందఱు గ్రంథకర్త లర్ధరాత్రి మొదలు హోర

చూడవలెనని చెప్పిరనియు, నీచెప్పినహోర ౨౪ ఘడియయనియు, ౨౪-కి ౫౹ అరఘడియలు, నీ యరఘడియలకు సూర్యహోరలో రవి శశి కుజ బుధ గురువు లధిపతులనియు, శుక్రహోరలో శుక్ర శని రవి చంద్ర అంగారకు లధిపతులనియు, నీక్రమమున నన్నిహోరలఁ జూడవలె ననియు, నీహోరలు పాపగ్రహకాలజనితము లయ్యేనేని వివాహాది శుభకర్మలయందు నిషేధింపవలయు నని యీవారములకు ననేకవిధము లైన నిర్ణయములు చెప్పిన నీగ్రంథకర్తమతము కొందఱ గ్రంథకర్త లకు నిష్టము. ఉదయముమొద లుదయపర్యంతము వారము.

అవ. శ్లోకద్వయేన ఖార్జూరచక్రలక్షణం నిరూపయన్ తద్దోషమాహ.—

ఖార్జూరాకృతిమూర్ధ్వగామృజు లిఖేదేకాం చ రేఖాం తత
స్తిర్యక్కాగ్రశలాకాస్త్రయోదశ తథా ఖార్జూరచక్రం త్విదమ్,
విష్కంభాదిషు దస్రభాదిశిరసి స్థాప్యైకలేఖాం గతౌ
స్యాతాం శీతగుభాస్కరౌ యది తయోర్దృష్టిర్మిథో మృత్యుకృత్.

వ్యా. ఖార్జూరేతి. ఏకాం రేఖామూర్ధ్వగాం, ఖార్జూరాకృతిం ఖార్జూర పత్రసదృశాం, ఋజు అవక్రం యథా తథా లిఖేత్, తతః తదనంతరం, తస్యాం తిర్యక్కాగ్రశలాకాస్త్రయోదశరేఖాః తథా లిఖితాశ్చేత్ ఇదం సప్తవింశతిరేఖాత్మకం ఖార్జూరచక్రం భవతి. శిరసి చక్రమూర్ధ్ని, విష్కంభాదిషు యోగేషు, దస్ర భాది అశ్విన్యాదినక్షత్రం, అభిజిద్వర్జం, స్థాప్య విలిఖ్య, గణనాయాం క్రియ మాణాయాం సత్యాం, శీతగుభాస్కరౌ శీతాః గావః కిరణాః యస్య సః చంద్రః భాస్కరస్సూర్యశ్చ, తావేకరేఖాం గతౌ స్యాతాం యది, తదా తయో శ్చంద్రసూర్యయోర్మిథః అన్యోన్యం దృష్టిర్భవతి. సా మృత్యుకృత్. అతశ్శుభ కర్మసు త్యాజ్యేత్యర్థః. అత్రాయం విశేషః.—న కేవలమేకరేఖాగతయోరేవ దృష్టిపాతః, కింతు చతుర్థపాదాద్యపాదగతయోర్ద్వితీయ తృతీయపాదగతయోశ్చ అన్యోన్యదృష్టిపాతః. న చతుర్థద్వితీయపాదగతయోర్వా చతుర్థతృతీయపాదగత యోర్వా ప్రథమద్వితీయపాదగతయోర్వా ప్రథమతృతీయపాదగతయోర్వా. తదుక్తం దైవజ్ఞవిలాసే.—'చతుర్థగస్త్వాద్యపాదమాద్యగస్తు చతుర్థగమ్. ద్వితీ యగస్తృతీయస్థం తృతీయస్థో ద్వితీయగమ్, సమాంఘ్రి వేదస్సర్వజ్ఞైర్విజ్ఞేయం ధిష్ణ్యమండల' మితి.

అవ. రెండుశ్లోకములచే ఖార్జూరచక్రలక్షణమును దెలియఁ జేయుచున్నవాఁడై యాదోషమును జెప్పుచున్నాఁడు.—

తా. ఖార్జూరపత్రమువలె నూర్ధ్వరేఖ యొకటి వ్రాసి యా రేఖ మీఁద ౧3 అడ్డగీతలు గీచిన సప్తవింశతి రేఖాత్మక మగునిది ఖార్జూర

విష్కంభము—అశ్వని



చక్రము.—ఈ చక్రము శిరశ్శునం దశ్వినీ నక్షత్రమును విష్కంభ నామయోగమును లిఖించి యక్కడినుండి సవ్యముగా లిఖించుచుండఁగా సూర్యచంద్రు లొకరేఖయం దున్న నక్షత్రములయందుండి యొకరినొకరు చూచిన నది మహాదుర్యోగము గనుక వివాహాది శుభకార్యములయందు నిషేధింపవలయును. ఇచట సూర్యచంద్రులకు నేకరేఖాగతనక్షత్రములయం దున్నమాత్రముచేతనే పరస్పరవీక్షణము గలుగదు. మఱియేమన్నను వీరిలో నాలవపాదమున నొకగ్రహమును మొదటిపాదమున నొకగ్రహము నుండఁగాను, రెండవపాదమున నొకగ్రహమును మూఁడవపాదమున నొక గ్రహము నుండఁగాను బరస్పరవీక్షణము గలుగునని తెలియవలయు.

విష్కంభ వ్యతిపాతశూలపరిఘాగండాతిగండాశని
వ్యాఘాతా అపి వైధృతిర్నిధనదా యోగా వివాహాదిషు,
దస్రాహీందుముఖా స్తథా దితిసుతానూరాధపుష్యాదితి
త్వష్ట్రాఖ్యాః క్రమశః ప్రదక్షిణవిధా జ్ఞేయాశ్శిరస్థోడుతః. 87

వ్యా. విష్కంభేతి. విష్కంభః వ్యతీపాతః శూలః పరిఘా గండః అతిగండః అశనిః వజ్రః వ్యాఘాతః వైధృతిః ఏతే నవయోగాః వివాహాదిషు శుభకర్మసు నిధనదాః, దస్రాహీందుముఖాః అశ్విన్యాశ్లేషామృగశిర్షముఖాః, తథా ఽదితిసుతానూరాధ పుష్యాదితిత్వష్ట్రాఖ్యాః మూలానురాధాపుష్యపునర్వసూచిత్రాశ్చేతి నవనక్షత్రాణి, శిరస్థోడుతశ్శిరోనక్షత్రాత్, క్రమశః ప్రదక్షిణవిధా ప్రదక్షిణక్రమేణ, జ్ఞేయాః. యస్య యోగస్య యన్నక్షత్రము క్తం తచ్ఛిరసి విలిఖ్య తదాది గణయేదిత్యర్థః. తద్యథా.—విష్కంభస్యాశ్వినీ, వ్యతీపాతస్యాశ్లేషా, శూలస్య మృగశీర్షం, పరిఘాయాః మఘా, గండస్య మూలా, అతిగండస్యానూరాధా, వజ్రస్య పుష్యః, వ్యాఘాతస్య పునర్వసూ, వైధృతే శ్చిత్రా.

తా. విష్కంభము, వ్యతీపాతము, శూల, పరిఘ, గండము, అతిగండము, వజ్రము, వ్యాఘాతము, వైధృతి యీయోగములు వివాహాదిశుభకర్మల కయోగ్యములనియు, అశ్విని, ఆశ్రేష, మృగశిర, మఖ, మూల, అనూరాధ, పుష్య, పునర్వసు, చిత్త ఈ ౯ నక్షత్రముల నుచ్ఛస్థానమందుండెడి నక్షత్రము మొదలు ప్రదక్షిణక్రమముగాఁ దెలియవలయుననియు, నేయోగమునకు నేనక్షత్రములు చెప్పియున్నవో యవి మొదలుచేసి ప్రదక్షిణక్రమముగా లిఖింపవలయు ననఁగా విష్కంభమునకు నశ్విని, వ్యతీపాతకు నాశ్రేష యీక్రమమున లిఖింపవలయును.

అవ. గ్రహణోత్పాతదోషమాహ.—

ఉత్పాతగ్రహణేభ్య ఏవ తు పరం సప్తాహమేవం త్యజే
ద్ధిష్ణ్యం తత్తదృతుత్రయేఽఖిలశుభేనేష్టం చ మృత్యుప్రదమ్,
గ్రస్తేఽస్తే పురతోఽర్ధమేవ పరతో గ్రస్తోదయేఽహ్నాం త్రయం
సంధ్యాయామపి సప్తసప్తదివసాన్నిశ్శేష ఏవం త్యజేత్. ౪౪

వ్యా. ఉత్పాతేతి. ఉత్పాతాః భూకంపధూమకేత్వాదయః, గ్రహణాని సూర్యాచంద్రమసోః సర్వగ్రాసగ్రహణాని, తేభ్యఃపరంపరతః, సప్తాహమేవం త్యజేత్, శుభకర్మణీతి శేషః. యన్నక్షత్రే ఉత్పాతగ్రహణాదయః సముత్పద్యంతే తత్తద్ధిష్ణ్యం, తన్నక్షత్రం ఋతుత్రయం షణ్మాసేషు అఖిలే శుభే మృత్యుప్రదం, అతో నేష్టం, గ్రస్తాస్తమయాదేర్విశేషమాహ—గ్రస్తేఽస్తఇతి. గ్రస్తేఽస్తే గ్రస్తాస్తమయఖండగ్రహణవిషయే, పురతః పూర్వం అర్ధమేవ సప్తాహార్ధం సార్ధదినత్రయమేవ త్యాజ్యం. గ్రస్తోదయే గ్రస్తోదయఖండగ్రహణే తు, పరతః గ్రహణాదూర్ధ్వం, అహ్నాం త్రయం దినత్రయం, త్యాజ్యం. సంధ్యాయామపి నిశ్శేషే సర్వగ్రాసగ్రస్తాస్తమయ గ్రస్తోదయగ్రహణేఽపి సప్తసప్తదివసాన్ త్యజేత్ సర్వగ్రాసగ్రస్తాస్తమయే పూర్వం సప్తాహం, సర్వగ్రాసగ్రస్తోదయే ఊర్ధ్వం సప్తాహం. అన్యత్ర ఖండగ్రహణేష్వనుపాతేన యోజనీయం, ఏవం మాసవిషయేఽపి. తదుక్తం.—'సర్వగ్రాసేషు షణ్మాసం అర్ధగ్రాసే తదర్ధకమ్, తదంతరేఽనుపాతేన త్యజేద్భాం గ్రహణాహత' మితి.

అవ. గ్రహణోత్పాతదోషములఁ జెప్పుచున్నాఁడు.—

తా. ఉత్పాతము లనఁగా భూకంపనము, ధూమకేతువు మొదలగు నుత్పాతములును సూర్యచంద్రగ్రహణములును గలిగెనేని యనంతరమం దేడువాసరములపర్యంతము శుభకర్మలు చేయఁగూడ దనియు, నేనక్షత్రమం దీచెప్పిన భూకంపనాద్యుత్పాతములు గలుగుచున్నవో యానక్షత్రము మృత్యుప్రద మౌటవలన నాఱు నెలలపర్యంతము వివా

హాదిశుభకర్మలవిషయమై యయోగ్యమనియు, నర్ధగ్రహణమై గ్రస్తాస్తమయమైన పక్షమునకుముందు 34 దినము కూడదనియు, నర్ధగ్రహణగ్రస్తోదయవిషయమై యనంతరము మూఁడుదివసములు కూడవనియు, సాయంకాలమున గ్రస్తాస్తమయమైన సర్వగ్రస్తగ్రహణమందు ముందు 2 దివసములు గ్రస్తోదయసర్వగ్రస్తగ్రహణమం దనంతరం బేడుదివసములును గూడవనియు, మఱియు గ్రహణవిద్ధనక్షత్రము పూర్ణగ్రహణము నందు ౬ మాసములవఱకు, నర్ధగ్రహణమునందు 3 మాసములవఱకు నీరీతిగా శుభకర్మవిషయమై యోగ్యము గాదనియు నెఱుఁగవలయు.

అవ. క్రూరయుక్తధిష్ణ్యదోషమాహ.—

తద్ధిష్ణ్యం జ్వలితం తు పాపసహితం మృత్యుప్రదం పృష్ఠభం
భస్మాఖ్యం త్వథ ధూమితం చ పురతో ధిష్ణ్యం వివాహాదిషు,
రాశిః క్రూరయుత స్తదాఖ్యఫలదశ్చాన్యౌ చ తౌ తాదృశౌ
పృష్ఠాగ్రౌ శుభసంయుతౌ యది శుభౌ స్యాతాం తు రాశీతు తౌ.౨9

వ్యా. తద్ధిష్ణ్యమితి. పాపసహితం పాపగ్రహయుక్తం, తద్ధిష్ణ్యం తన్నక్షత్రం, జ్వలితం జ్వలితసంజ్ఞం, పృష్ఠభం పాపగ్రహయుక్తనక్షత్రం తు, భస్మాఖ్యం భస్మసంజ్ఞకం, అతః పురతో ధిష్ణ్యం పాపగ్రహస్య అగ్రగతం నక్షత్రం తు, ధూమితం ధూమితసంజ్ఞకం ఏతన్నక్షత్రత్రయం మృత్యుప్రదం, అతో వివాహాదిషు త్యాజ్యం. క్రూరయుతః పాపగ్రహాక్రాంతరాశిశ్చ, తదాఖ్యఫలదః తదాఖ్యః జ్వలితసంజ్ఞః తత్ఫలదః పూర్వవన్మృత్యుప్రదః, అన్యౌ తౌ పాపగ్రహాపృష్ఠాగ్రగతౌ, రాశిభస్మితధూమితాఖ్యౌ. అత్ర విశేషమాహ.—పృష్ఠాగ్రౌ రాశీ శుభసంయుతౌ యది, తదా శుభౌ స్యాతాం శుభప్రదౌ భవేతామ్.

అవ. క్రూరయుక్తధిష్ణ్యమనుదోషమును జెప్పుచున్నాఁడు.—

తా. పాపగ్రహముతోఁ గూడిననక్షత్రము జ్వలితసంజ్ఞికమనియుఁ, బాపగ్రహమునకు వెంబడియున్న నక్షత్రము భస్మసంజ్ఞికమనియు, పాపగ్రహమునకు ముందున్ననక్షత్రము ధూమిత సంజ్ఞికమనియు నీమూఁడునక్షత్రములు మృత్యుప్రదము లౌటవలన వివాహాదివిషయమై నిషేధింపవలయు ననియు, పాపగ్రహయుక్తమైన రాశియును జ్వలితసంజ్ఞికమే గనుక ముందుఁ జెప్పిన ఫలప్రదమనియు, మిగిలిన పృష్ఠాగ్రగతరాసులు భస్మితధూమిత సంజ్ఞికము లైనను శుభగ్రహయుక్తము లాయెనేని శుభప్రదము లనియు నెఱుంగఁదగును.

౪౫. అథ పంచశలాకచక్రముద్ధరతి పాపగ్రహావిద్ధదోషవర్జనాహ.—

తిర్యక్పంచ తథోర్ధ్వగాశ్శరమితా ద్వే ద్వే చ కోణద్వయే
చక్రేఽత్రైవ విలిఖ్య శంభువిదిశి ద్వైతీయరేఖాదితః,
అష్టావింశతిభాని చ జ్వలనభాదీన్యేవ రేఖాగ్రతః
స్థాప్యాని గ్రహవేధవర్జితముడు గ్రాహ్యం వివాహే బుధైః. ౧౦

వ్యా. తిర్యగితి. పంచరేఖాస్తిర్యగ్లిఖిత్వా తథా శరమితాః పంచరేఖా ఊర్ధ్వగా విలిఖేత్. పునః కోణద్వయే ఈశాన్యనైరృతికోణద్వయే ఆగ్నేయవాయవ్యకోణద్వయే చ ద్వే ద్వే రేఖే విలిఖేత్. అత్రైవచక్రే పంచశలాకచక్ర ఏవ, శంభువిదిశి ఈశాన్యవిదిశి, విద్యమానాయాద్వితీయైవ ద్వైతీయా సా రేఖా, తదాదితః ఈశాన్యకోణస్థద్వితీయరేఖామారభ్యేత్యర్థః. రేఖాగ్రేషు జ్వలనభాదీని కృత్తికాదీని, అష్టావింశతిభాని నక్షత్రాణి, స్థాప్యాని లేఖనీయాని. గ్రహవేధవర్జితం గ్రహవేధశ్చ యద్రేఖాగతనక్షత్రస్య యద్రేఖాగతనక్షత్రస్థితగ్రహేణ వేధః, తద్వర్జితం; యథా.—కృత్తికాయాం సితపాపగ్రహేణ విశాఖాయాః వేధః. ఏవమన్యత్రాప్యూహ్యం. ఏతాదృశవేధహీనం, ఉడునక్షత్రం 'నక్షత్రమృక్షం భం తారా తారకాప్యుడు వా స్త్రియా' మిత్యమరః. వివాహే బుధైర్విద్వజ్జనైర్గ్రాహ్యం. వివాహమిత్యుపలక్షణం సకలశుభకర్మస్వితి భావః.

తా. ౫ అడ్డగీతలువ్రాసి దానిమీఁద ౫ నిడుపుగీతలువ్రాసి యీచక్రకోణముల యందు రెండేసి గీతలు వ్రాసి యీచక్రమం దీశాన్యకోణమందు వ్రాయఁబడిన రెండవ రేఖ మొదలుకొని యన్ని రేఖాగ్రముల యందును క్రమముగాఁ గృత్తికాది ౨౮ నక్షత్రములను వ్రాసి పరిశోధించి పాపగ్రహవేధలేని నక్షత్రమందు వివాహాదిశుభకర్మలఁజేయుట పండితసమ్మతము.



అవ. విషఘుటికాదోషమాహ.—

నైశం వీర నలం నభో భయకరం నీలం నరంఫాల నా
గో నీరం హాయ కార నీర భయ భూపో నేక ఖేకం తమః,
వారం నీర నకం నయం హాయ తపో వారం నగం దస్రత
స్సంఖ్యోర్ధ్వం విషనాడికా హ్యుదధయో లగ్నస్పృశో మృత్యుదాః.

వ్యా. నైశమితి. దస్రతః అశ్విన్యాదేః, నైశాదిసంఖ్యోర్ధ్వవిషనాడికా దస్రః యథా నైశం అశ్విన్యాః పంచాశత్, భరణ్యాః వీరం చతుర్వింశతిః, కృత్తికాయాః నలం త్రింశత్, రోహిణ్యాః నభశ్చత్వారింశత్, మృగశీర్షస్య భయం చతుర్దశః, ఆర్ద్రాయాః కరం ఏకవింశతిః, పునర్వస్వోః నీలం త్రింశత్, పుష్యస్య నరం వింశతి, ఆశ్రేషాయాః ఫాలం ద్వాత్రింశత్, మఘాయాః నాగః త్రింశత్, పూర్వఫల్గున్యాః నీరం వింశతిః, ఉత్తరఫల్గున్యాః హాయః అష్టాదశ, హస్తస్య కారః ఏకవింశతిః, చిత్రాయాః నీరం వింశతిః, స్వాత్యాః భయం చతుర్దశ, విశాఖాయాః భూపశ్చతుర్దశ, అనూరాధాయాః నేకం దశ, జ్యేష్ఠాయాః ఖేకం చతుర్దశ, మూలస్య తమః షట్పంచాశత్, పూర్వాషాఢాయాః వారం చతుర్వింశతిః, ఉత్తరాషాఢాయాః నీరం వింశతిః, శ్రవణస్య నకం దశ, ధనిష్ఠాయాః నయం దశ, శతభిషజః హాయః అష్టాదశ, పూర్వాభాద్రాయాః తపః షోడశ, ఉత్తరాభాద్రాయాః వారం చతుర్వింశతిః, రేవత్యాః నగం త్రింశత్, ఏవముక్తర సంఖ్యయా అశ్వినీమారభ్య రేవత్యంతానాం ఋక్షాణాం ఉక్తఘటికానంతరం విషనాడికాః వర్జ్యఘటికాః ఉదధయశ్చతస్రః జ్ఞేయాః, తా ఏతాశ్చతస్రో ఘటికాః లగ్నస్పృశశ్చేన్మృత్యుదాః.

అవ. విషఘుటికానిర్ణయమును జెప్పుచున్నాఁడు:—

తా. ౫౦, ౨౪, ౩౦, ౪౦, ౧౪, ౨౧, ౩౦, ౨౦, ౩౨, ౩౦, ౨౦, ౧౮, ౨౧, ౨౦, ౧౪, ౧౪, ౧౦, ౧౪, ౫౬, ౨౪, ౨౦, ౧౦, ౧౦, ౧౮, ౧౬, ౨౪, ౩౦ అశ్విన్యాదులగు ౨౭ నక్షత్రములకుఁ గ్రమంబుగఁ బైన నాలుగుగడియలు విషఘటికలు గావున నివి వివాహాదిలగ్నమును స్పృశించిన మృత్యుప్రదంబు లగును.

అవ. లగ్నాస్తదోషమాహ.—

లగ్నాంశేఽభ్యుదితే తదంశపతినా దృష్టే యుతే వా శుభై
ర్మిత్రేణాపి కరగ్రహస్తు శుభదో నో చేద్వరస్యాంతకృత్,

అస్తాంశేఽపి తథైవ తత్పతియుతే దృష్టే శుభైర్వా గ్రహైః
కన్యాయాశ్శుభదో న చేన్నిధనదః పాణిగ్రహో లగ్నతః. 92

వ్యా. లగ్నాంశ ఇతి. లగ్నాంశే లగ్నస్య నవాంశకే, అభ్యుదితే సతి, తదంశపతినా తన్నవాంశాధిపతినా, తల్లగ్నే దృష్టే యుతే వా, శుభగ్రహైః దృష్టే యుతే వా, మిత్రేణ నవాంశాధిపతేర్యో మిత్రగ్రహస్స క్రూరశ్శుభో వా, తేన దృష్టే, యుతే వా యది, కరగ్రహః వివాహః శుభదః, న చేల్లగ్నే శుభగ్రహైః తదంశపతినా వా తన్మిత్రేణ వా, అయుతే అదృష్టే వా యది, తదా వరస్యాంతకృత్ మృత్యుప్రదః. లగ్నతః అస్తాంశేఽపి తథైవ యల్లగ్నే యత్సంఖ్యకో నవాంశోఽభ్యుదితః తత్సప్తమలగ్నే తత్సంఖ్యకో నవాంశోఽస్తాంశః, తస్మిన్ తత్పతియుతే తదంశపతినా యుక్తే దృష్టే వా సతి, అథవా శుభగ్రహైర్యుతే దృష్టే వా యది, పాణిగ్రహః కన్యాయాః శుభదః, న చేత్ ఉక్తార్థాభావే, నిధనదో భవేత్.

అవ. లగ్నాస్తదోషమును జెప్పుచున్నాఁడు.—

తా. వివాహలగ్నమునకు నవాంశమును నిర్ణయించినపిమ్మట లగ్న మానవాంశాధిపతిచేతనైనను, శుభగ్రహములచేతనైనను, నవాంశాధిపతి మిత్రగ్రహముఁ చేతనైనను చూడఁబడుచున్నను, లేక వీనితోఁ గూడియున్న నట్టి లగ్నమునఁ జేయఁబడిన వివాహము వరునికి శుభకరంబగును. అట్లుగాకున్న హానికరంబగును. ఏలగ్నమునం దెన్నవయంశము నవాంశమగునో యాలగ్నమున కేడవలగ్నమునం దన్నవమయంశ మస్తాంశమగును. అట్టి యస్తాంశ మానవాంశాధిపతిచేతనైనను, శుభగ్రహములచేతనైనను, జూడఁబడుచున్నైనను లేక వీనితోఁగూడియైన నుండెనేని యిట్టిసమయమున నొనర్చిన వివాహము కన్నియకు శుభప్రదంబగును. అట్లు గాకున్న మృత్యుప్రదం బగును.

అవ. గండాంతదోషమాహ.—

గండాంతస్తు యదంతరాళముభయోర్ఝాలేంద్రయో రశ్వినీ
రేవత్యోః పితృసార్పయోస్తు ఘటికా అష్టౌ చ మృత్యుప్రదాః,
చాపాళ్యోర్ఝషమేషయోశ్చ మృగరాట్కుళీరయోర్మధ్యమే
నాడ్యేకైవ మృతిప్రదైవ యది సా వర్గోత్తమాంశాన్వితా. 93

వ్యా. గండాంత ఇతి. ఉభయోర్నక్షత్రయోః రాశ్యోర్వా యదంతరాళం తత్ గండాంత ఇత్యుచ్యతే. తదేవ విశదయతి.—ఉభయోర్ఝాలేంద్రయోః

మూలజ్యేష్ఠయోః, అశ్వినీరేవత్యోశ్చ, పిత్రుసార్పయోరాశ్రేషామఘయోశ్చ, మధ్యమే అష్టాఘటికాః మృత్యుప్రదాః, జ్యేష్ఠాయా అంత్యఘటికాశ్చతస్రః, మూలస్య ఆద్యఘటికాశ్చతస్రః, మిళిత్వా అష్టఘటికా భవంతీతి వివేకః. ఏవ ముత్తరత్రాప్యనుసంధేయం, చాపాళ్యోః ధనుర్వృశ్చికయోః, ఝషమేషయోః మీనమేషయోః; మృగరాట్కుళీరయోః సింహకర్కటయోశ్చ, ఏతయోర్మధ్యే, సాద్యైకా ఏకఘటికైవ, మృతిప్రదా, సారాశ్యోరంతరాళఘటికావర్గోత్తమాంశా న్వితాపి మృత్యుప్రదైవ.

అవ. గండాంతదోషమును జెప్పుచున్నాఁడు.—

తా. జ్యేష్ఠమూలలు, అశ్వినీరేవతులు, మఘాశ్రేషలు ఈనక్షత్రముల మధ్యకాలమున ౮-ది ఘడియలు గండాంత మగును. అనఁగా జ్యేష్ఠ, రేవతి, ఆశ్రేష నక్షత్రములతుదలయందు ౪ ఘడియలును, మూల, అశ్విని, మఘ ఈనక్షత్రములయాదియందు ౪ ఘడియలును, నక్షత్రగండాంతములుగాన నిదియును వృశ్చిక, మీన, కర్కటకరాసుల తుదయందరఘడియయు ధనుర్మేషసింహరాసుల యాదియం దర ఘడియయు రాశిగండాంత మగుటవలన నిది వర్గోత్తమాంశయుక్తమై యున్న నిదియును వివాహాదిశుభకర్మలవిషయమై మృత్యుప్రదము.

అవ. తిథిగండాంతమాహ.—

మాసాదేరథ పంచ పంచ తిథయో నందా చ భద్రా జయా
రిక్తా స్యాచ్చ పునఃపున స్తదభిధాః పూర్ణా క్రమాత్పంచమీ,
నందాదౌ ఘటికాద్వయం నిధనకృత్పూర్ణాంత్యనాడీద్వయం
గండాంతాస్త్రివిధాస్సదా నిధనదాస్త్యాజ్యా వివాహాదిషు. 94

వ్యా. మాసాదేరితి. మాసాదేః శుక్లప్రతిపదారభ్య, అథ అనంతరం, పంచ పంచతిథయః, క్రమాత్ నందా భద్రా జయా రిక్తా పంచమీపూర్ణా ఇతి, పునః పున స్తదభిధాః తత్సంజ్ఞికా భవంతి; తత్ప్రయోజనమాహ.—నందాదౌ ప్రతిప త్షష్ఠ్యేకాదశీనాం ఆదౌ, ఘటికాద్వయం నిధనకృత్, పూర్ణాంత్యనాడీద్వయం పూర్ణతిథ్యంతే ఘటికాద్వయం చ నిధనకృత్, త్రివిధాః నక్షత్రరాశితిథి సంజ్ఞయా త్రివిధాః, గండాంతాః, వివాహాదిషు సదా నిధనదాః, అతస్త్యాజ్యాః.

అవ. నందభద్రాది తిథినిర్ణయపూర్వకంబుగ తిథిగండాంతమును జెప్పుచున్నాఁడు.—

తా. శుద్ధపాడ్యమి మొదలైదేసితిథులు క్రమముగ నంద, భద్ర, జయ, రిక్త, పూర్ణ యనుసంజ్ఞ గలవై యుండును. అందు నంద

ములను నొకరాశిజేసి యారాశిని నైదు భాగములుగాఁజేసి, యందు ప్రథమభాగముతోఁ బదియయిదును రెండవభాగముతో పండ్రెండును మూఁడవభాగముతో నెనిమిదియు నైదవభాగముతో నాలుగును జేర్చి యొక్కొక్కభాగమును వేర్వేఱున తొమ్మిదింట భాగింపఁగా ప్రథమభాగమం దైదు మిగిలెనేని రోగపంచక మనియును, రెండవభాగమం దైదు మిగిలెనేని యగ్నిపంచకమనియును, మూఁడవభాగమున నైదు మిగిలెనేని రాజపంచక మనియు, నాలవభాగమున నైదు మిగిలెనేని మృత్యుపంచకమనియును సిద్ధాంతంబు గావున నీపంచకలగ్నములయందు ప్రయాణము మొదలగు శుభకార్యములఁ జేయఁగూడదు.

అవ. అంగీకారార్థమాహ.—

వ్యాధ్యగ్నిక్షితిపాలచోరమృతితో భీతిశ్చ శూన్యే క్రమా
దేతత్పంచదశాదియోజితఫలం మృత్యోర్భయం సర్వదా,
చోరవ్యాధిభయం నిశాసు దివసే భూపాగ్నిభీతి ర్భవే
ద్యాత్రాపంచకశుద్ధిరేవ గమనే సంజీవనీయా ఖలు. 172

వ్యా. వ్యాధీతి. వ్యాధ్యగ్నిక్షితిపాలచోరమృతితః భీతిశ్చ క్రమాత్, శూన్యే పంచశేషే సతి ఆదిపఙ్క్తౌ పంచశేషశ్చేద్వ్యాధితః, ద్వితీయాయాం పంక్తౌ పంచశేషశ్చేదగ్నితః, తృతీయాయాం క్షితిపాలతః, తురీయాయాం చోరతః చోరాత్, పంచమ్యాం పంక్తౌ మృతితః, భీతిర్భయం భవేత్, ఏతత్పంచదశాది యోజితఫలం గమనవిషయే చింత్యం, మృత్యోర్భయం 'భీత్రార్థానాం భయహేతు' రిత్యపాదానత్వం, సర్వదా త్యాజ్యమితి శేషః, అన్యేషాం కాలభేదేనాంగీకారా దంగీకారమేవాహ, చోరవ్యాధిభయం, నిశాసు రాత్రిష్వేవ, న దివాభాగే. భూపాగ్నిభీతిస్తు దివసే దివాభాగఏవ, న రాత్రౌ భవేత్. గమనే యాత్రాయాం, ఇయం పంచకశుద్ధిః, సంజీవనీయాఖలు దివ్యౌషధవత్ ప్రాణసంరక్షణీయా ఖలు, అతో విచారణీయేత్యర్థః.

అవ. అంగీకారార్థమును జెప్పుచున్నాఁడు.—

తా. ప్రథమపంక్తియం దైదు మిగిలెనేని వ్యాధిభయమును, ద్వితీయపంక్తియం దగ్నిభయమును, తృతీయపంక్తియందు రాజభయమును, చతుర్థపంక్తియందు చోరభయమును, పంచమపంక్తియందు మృత్యుభయమును గలుగును గాన నీ పంచమదశాదియోజితఫలము గమనవిషయమై యావశ్యకముగా నాలోచింపఁ దగినది. మిగతకాల

భేదములచే నంగీకార మగును. అంగీకారక్రమం బెట్లనిన; మృత్యు భయము సర్వదా త్యాజ్య మనియును, చోరవ్యాధిభయములు రాత్రు లందును, భూపాగ్నిభయములు పగటియందును బలిష్ఠములుగాన నాకాలములయం దవశ్యముగ నాలోచింపఁ దగిన వనియును, ఈపంచక శుద్ధి సంజీవిని యనునౌషధవిశేషమువలె ప్రాణసంరక్షక మైనదిగాన ప్రయాణవిషయమై యవశ్యము విచారింపఁదగినదనియును భావము.

అవ. యాత్రాచంద్రకంటకనిర్ణయమాహ.—

జీవేచ్ఛుర్యది చంద్రకంటకగృహేష్వేతేషు నైవ వ్రజే
న్మేషే సింహగృహే ధనుష్యపి సుధీర్యాతా ప్రతీచీం దిశమ్,
కౌబేరీం మకరే వృషే చ యువతౌ యామ్యే తులాయాం ఘటే
ప్రాచీం మృత్యుదిశం తు కర్కటగృహే మీనాలయే వృశ్చికే. 173

వ్యా. జీవేచ్ఛురితి. సుధీర్బుద్ధిమాన్, యాతా, జీవేచ్ఛుః జీవితుమిచ్ఛా యస్య స తథోక్తః జీవితాశావాన్ యది, ఏతేషు వక్ష్యమాణేషు, చంద్రకంటక గృహేషు, న వ్రజేత్. తథాహి.—మేషే సింహే ధనుషి చ ప్రతీచీం దిశం, మకరే వృషే యువతౌ కన్యాయాముదీచీం దిశం, మిథునతులాకుంభేషు ప్రాచీం దిశం, కర్కటమీనవృశ్చికేషు మృత్యుదిశం దక్షిణాం దిశం, న వ్రజేదితి సర్వ త్రానుషంగః.

అవ. యాత్రాచంద్రకంటకనిర్ణయమును దెలియఁజేయుచున్నాఁడు.—

తా. మేషసింహధనూరాసులు పశ్చిమదిక్కునకును, మకరవృషభ కన్యలుత్తరదిక్కునకును, మిథునతులాకుంభములు తూర్పుదిక్కునకును, కటకమీనవృశ్చికములు దక్షిణపుదిక్కునకును చంద్రకంటకరాసులు గాన జీవితాశగల ప్రయాణకర్త యీచెప్పఁబడిన చంద్రకంటకరాసులలో నాయాదిక్కులకు పయనము పోఁగూడదు.

అవ. యాత్రాలలాటమాహ.—

ప్రాచ్యాదిప్రభవోఽర్కశుక్రకుజరాహ్వార్కీందువిట్సూరయో
యద్దిగ్రాశిషు తద్దిగుత్తగృహగే తాం తాం దిశం న వ్రజేత్,
ప్రాగాదిక్రమశః ప్రదక్షిణవిధౌ భానుప్రవిష్టాలయా
ద్ధిత్ర్యేకం ద్వితయం విదిక్షు మృతికృద్యాత్రాలలాటం త్విదమ్. 174

వ్యా. ప్రాచ్యాదితి. అర్కశుక్రకుజరాహవః, ప్రసిద్ధాః, అర్కస్యాపత్యం పుమాన్ ఆర్కిః. అత ఇఞ్ 'తద్ధితేష్వచామాదే'రితి వృద్ధిః. శనైశ్చరః, ఇందుశ్చంద్రః, విద్బుధః, సూరిర్గురుః, ఇత్యేతే అష్టౌ గ్రహాః, ప్రాచ్యాదిప్రభవః ప్రాగాదీనాం దిశాం క్రమాత్ప్రభవః, అధిపతయో భవంతి. యద్దిగ్రాజి యస్యా దిశో యో రాట్ తస్మిన్ రాజి, తద్దిక్స్వగృహాగే తస్యా దిశో యత్ గృహం రాశిః తత్ర స్థితే సతి, తద్రాశౌ తాం తాం దిశం న వ్రజేది, భానుప్రవిష్టాలయాత్ సూర్యాధిష్ఠితరాశిమారభ్య, అప్రదక్షిణ విధౌ క్రమశః ప్రాగాది యథా తథా, దిక్షు ఏకైకం, విదిక్షు ద్వితయం రాశిద్వయం, విక్షిపేదితి శేషః. అత్రాయమాశయః—సూర్యాధిష్ఠితరాశౌ ప్రాచ్యాం నిక్షిపేత్, సూర్యస్య ప్రాగ్దిశకత్వాత్ తద్రాశౌ ప్రాచీం దిశం న వ్రజేత్, సూర్యస్థితరాశేర్ద్వితీయరాశిద్వయమీశాన్యాం నిక్షిపేత్, తద్దిశో గుర్వధిపతిత్వాత్, తద్రాశిద్వయే గురౌ స్థితే సతి తల్లగ్నద్వయే ఈశాన్యాం న వ్రజేత్, సూర్యరాశేశ్చతుర్థరాశిముదీచ్యాం నిక్షిపేత్, తద్దిశో బుధాధిపతిత్వాత్, తద్రాశౌ బుధే స్థితే సతి తల్లగ్నే ఉదీచీం న వ్రజేత్, సూర్యస్థితరాశేః పంచమషష్ఠరాశిద్వయం వాయవ్యాం నిక్షిపేత్, తద్దిశశ్చంద్రాధిపతిత్వాత్, తద్రాశిద్వయే చంద్రే స్థితే సతి తల్లగ్నద్వయే వాయవ్యాం న వ్రజేత్, సూర్యస్థితరాశేస్సప్తమరాశిం వారుణ్యాం నిక్షిపేత్, తద్దిశః శనైశ్చరాధిపతిత్వాత్, తద్రాశౌ శనైశ్చరే స్థితే సతి వారుణీం దిశం న వ్రజేత్, సూర్యస్థితరాశేః అష్టమ నవమరాశిద్వయం నైరృత్యాం నిక్షిపేత్, తద్దిశో రాహ్వధిపతిత్వాత్, తద్రాశిద్వయే రాహౌ స్థితే సతి తల్లగ్నద్వయే నైరృతీం దిశం న వ్రజేత్, సూర్యరాశేర్దశమరాశిం దక్షిణస్యాం నిక్షిపేత్, తద్దిశః కుజాధిపతిత్వాత్, తద్రాశౌ కుజే స్థితే సతి తల్లగ్నే దక్షిణాం దిశం న వ్రజేత్, సూర్యస్థితరాశేరేకాదశద్వాదశరాశిద్వయమాగ్నేయ్యాం నిక్షిపేత్, తద్దిశశ్శుక్రాధిపతిత్వాత్, తద్రాశిద్వయే శుక్రే స్థితే సతి తల్లగ్నద్వయే ఆగ్నేయ్యాం దిశం న వ్రజేదితి సూక్ష్మదృశాఽవగంతవ్యం. ఇదం యాత్రాలలాటం మృతికృత్, అతస్సర్వదా త్యాజ్యమిత్యాశయః.

అవ. యాత్రాలలాటస్వరూపమును జెప్పుచున్నాఁడు.—

తా. తూర్పుదిక్కు మొదలు ప్రదక్షిణక్రమంబున సూర్యుఁడు, గురువు, బుధుఁడు, చంద్రుఁడు, శని, రాహువు, అంగారకుఁడు, శుక్రుఁడు వీరలెనమండ్రు నెనిమిదిదిక్కులకుఁ బ్రభువులుగాన సూర్యుఁడున్న రాశిని తూర్పున నునిచి యారాశి మొదలు తక్కిన రాసులను ప్రదక్షిణక్రమముననే సమదిక్కులయం దొక్కొక్కటిని మూలలయందు రెండేసిగాఁ బండ్రెండురాసుల నుంచఁగా, నేరాశి యేదిక్కునకు వచ్చుచున్నదో యారాశియం దాదిక్కునకుఁ బ్రభువైన గ్రహముండఁగా నాదిక్కునకుఁ బయనము పోవ మృతికరంబు.

అవ. యుద్ధగమనే రాహుఫలమాహ.—

రాహ్వాక్రాంతభతస్త్రయోదశ ముఖం భాన్యగ్రతః పృష్ఠతః
పుచ్ఛం కేతురితి త్రయోదశ రవిస్స్థాయీ చ యాయీ శశీ,
యస్మిన్నాస్యగతే గ్రహే పరిభవస్తస్యైవ పుచ్ఛం గతే
యస్మిన్ తస్య జయో గతౌ యుధి చ తావేకత్ర తత్తద్భవేత్.

వ్యా. రాహ్వితి. రాహ్వాక్రాంతభతః రాహుస్థితనక్షత్రాదగ్రతః, త్రయోదశభాని ముఖం రాహుముఖం, పృష్ఠతో రాహ్వాక్రాంతనక్షత్రాత్ పృష్ఠతః త్రయోదశనక్షత్రాణి, పుచ్ఛం కేతుః పుచ్ఛరూపకేతుర్భవతి, ఏవం చ సతి రవిః స్థాయీ, శశీయాయీ, ఏవం చోభయోర్మధ్యే, యస్మిన్ గ్రహే, ఆస్యగతే ముఖగతే సతి, తస్యైవ పరిభవః తిరస్కారః, పలాయనమితి యావత్. స్థాయిని సూర్యే ముఖే స్థితే, స్థాయినో భంగః, యాయిని చంద్రే ఆస్యగతే సతి యాయినో భంగః, స్థాయినో జయ ఇత్యాశయః. యస్మిన్ గ్రహే పుచ్ఛం గతే స్థాయిని సూర్యే పుచ్ఛం గతే, తస్య స్థాయినోజయః, యాయిని చంద్రే పుచ్ఛం గతే యది యాయినో జయః, తౌ సూర్యాచంద్రమసౌ, ఏకత్ర గతౌ ముఖే పుచ్ఛే వా గతౌ యది, యుధి యుద్ధే, తత్తద్భవేత్, ఉభావాస్యగతౌ చేదుభయోర్భంగః, పుచ్ఛగతౌ చేదుభయోర్జయః. సమత్వం భవేదిత్యర్థః.

అవ. యుద్ధమునకుఁ బోవునపుడు రాహుఫలముఁ జెప్పుచున్నాఁడు.—

తా. రాహుస్థితనక్షత్రము మొదలు ముందు పదుమూఁడునక్షత్రములు ముఖమును, వెనుక పదుమూఁడు నక్షత్రములు తోఁకయుఁ గాఁగా సూర్యుఁడు స్థాయి యనియును, జంద్రుఁడు యాయి యనియుఁ జెప్పఁబడును. ఈయిరువురిలోఁ దోఁకయం దున్నవానికి జయము ముఖమం దున్నవానికి పరాజయము నని తెలియవలెను. స్థాయి యగు సూర్యుఁడు తోఁకయం దుండునక్షత్రములలో నుండునేని గృహాగతుఁ డగువానికి జయము. యాయియగు చంద్రుఁ డుండునేని రాణువతో యుద్ధమునకు వెడలువానికి జయము. సూర్యుఁడు ముఖమం దుండునేని స్థాయికి భంగము. చంద్రుఁ డుండునేని యాయికి భంగము. సూర్యచంద్రు లిరువురును ముఖస్థానమునం దుందురేని రాణువతో వెడలిపోవు రాజునకును తనపురములో నున్న రాజునకు నుభయులకు నపజయము. ఆ యిరువురు నుచ్ఛస్థాన నక్షత్రములయం దుండిరేని యిరువురకు సమజయము.

అవ. అథ గమనే వర్జ్యకాలమాహ.—

దగ్ధే స్వస్య గృహే కళత్రకలహే యస్యార్తవే శోభనే
మధ్యే వా యది జాతకే చ మృతకే మాసేఽష్టమే జన్మతః,
పిత్రోర్వా క్షయవత్సరే యది పితృశ్రాద్ధక్రియానంతరే
జీవార్థీ యది న వ్రజేత్స్వయువతౌ గర్భాన్వితాయామపి. 176

వ్యా. దగ్ధ ఇతి. స్వస్య గృహే దగ్ధే సతి, కళత్రకలహే కళత్రేణ కలహం కృత్వేత్యర్థః, యస్యార్తవే యస్య కళత్రస్యార్తవే రజసి, శోభనే మధ్యే, శోభనమధ్యే వా, జాతకే జాతకాశౌచమధ్యే, మృతకే మృతాశౌచమధ్యే చ, జన్మతః జన్మమాసాదష్టమే మాసి వా, పిత్రోః పితా చ మాతా చ పితరౌ తయోః పిత్రోః, పితామాత్రేత్యేకశేషః. క్షయవత్సరే పితృశ్రాద్ధక్రియానంతరే. మాతాపిత్రోస్సాంవత్సరికాత్పరదినే, స్వయువతౌ స్వభార్యాయాం గర్భాన్వితాయామపి, ఇదం షాణ్మాసాదూర్ధ్వం బోధ్యం, ఏతేషు సర్వేషు, ప్రయాతా జీవితార్థీ ఆయుష్కామో యది న వ్రజేత్ న గచ్ఛేత్, విధ్యర్థే లిఙ్.

అవ. ప్రయాణవిషయమైన నిషేధకాలమును జెప్పుచున్నాఁడు.—

తా. జీవితాశగలపురుషుఁడు తనగృహ మగ్నిదగ్ధ మగునపుడును, భార్యతోఁ గలహముఁచేసిన సమయంబునను, భార్య రజస్వలయైయుండు నపుడును, శుభమధ్యకాలంబునను, జాతాశౌచమృతాశౌచమధ్యకాలమందును, స్వజన్మమాసమున కెనిమిదవమాసమందును, తల్లిదండ్రులు మృతిపొందిన సంవత్సరమందును, తల్లిదండ్రుల శ్రాద్ధదివసమునకు మఱుదినమందును, తనభార్య యాఱునెలలకు పైఁబడిన గర్భము గలదయి యుండునపుడును, పయనము పోవునేని క్షేమమును బొందఁడు.

అవ. అభిజిద్ధనిష్ఠాపంచకే గమననిషేధమాహ.—

స్యాద్భంగోఽభిజిదాహ్వయే చ నిలయే ధిష్ణ్యే ముహూర్తే తథా
రోగస్స్యాద్వసుభస్య చోత్తరదళాదృక్షేషు పంచస్వపి,
దుఃఖం దక్షిణదిక్ప్రయాతురథవా నాన్యత్ర యాతు స్త్వయం
మీనే చేదథ సర్వదిక్షు గమనం యాతుశ్చ వక్రం భవేత్. 177

వ్యా. స్యాదితి. అభిజిదాహ్వయే నిలయే అభిజిల్లగ్నే, ధిష్ణ్యే ముహూర్తే అభిజిన్నక్షత్రే, అభిజిన్ముహూర్తే చ, ప్రయాతుః భంగస్స్యాత్. వసుభస్య ధనిష్ఠానక్షత్రస్య ఉత్తరదళాదారభ్య రేవత్యంతేషు పంచసు ఋక్షేష్వపి,

యాతుః రోగః స్యాత్, యాతురితి సామాన్యనిర్దేశేన సకలదిక్షు ప్రయాతురపి గమననిషేధ ఉక్తో భవతీత్యాశంకాయా మిదానీం పక్షాంతరమాహ. అథవేతి.— అథవా దక్షిణదిక్ప్రయాతుః పూర్వోక్తేషు గమనం దుఃఖం, దుఃఖకరమిత్యర్థః. అన్యత్ర యాతుః అన్యదిక్ప్రయాతుః, అయం ధనిష్ఠాపంచకే గమననిషేధస్తు న భవతి, మీనే చంద్రే స్థితే సతి తు సర్వదిక్షు గమనం యాతుర్వక్రం భవేత్, ప్రయాణసిద్ధిర్న భవేదిత్యర్థః.

అవ. అభిజిద్ధనిష్ఠాపంచకమందు గమననిషేధమును జెప్పుచున్నాఁడు.—

తా. అభిజిల్లగ్నమందును, అభిజిన్నక్షత్రమందును, అభిజిన్ముహూర్తమందును పైనము పోవువారల కశుభకరంబనియును, ధనిష్ఠా నక్షత్రోత్తరదళము మొదలు రేవతివఱకు ధనిష్ఠాపంచకము గాన నీ పంచకమందు దక్షిణదిక్కునకు పయనము పోవువారలకు రోగకరం బనియు, నితరదిక్కులకుఁ బోవువారలకు శుభకరం బనియు, మఱియును మీనరాశియందుఁ జంద్రుఁ డుండఁగా నేదిక్కునకుఁ బయనము పోయిన ను ప్రయాణకర్తకు నిష్టసిద్ధి గలుగదనియు నెఱుఁగఁదగినది.

అవ. నానాయాత్రాసు లగ్న నిర్ణయమాహ.—

స్త్రీయాత్రా సుఖదా వృషే చ యువతౌ యుగ్మే ప్రయాతుర్ఘటే
గోయాత్రా పశులాభదైవ వృషభే మేషే హరౌ వా మృగే,
కుంభే కర్కటకే ఝషే చ మకరే యాతుర్జనస్యార్థదా
శౌర్యాయుష్యధనప్రదా గవి హరౌ యుద్ధే తు చాపేఽప్యజే. 178

వ్యా. స్త్రీయాత్రేతి. వృషే యువతౌ కన్యాయాం, యుగ్మే మిథునే చ, స్త్రీయాత్రా స్త్రీణాం, యాత్రా, సుఖదా, ఘటే తులాయాం, వృషభే, మేషే, హరౌ, సింహే, మృగే మకరే చ, యాతుః గోయాత్రా పశులాభదా, కుంభే, కర్కటకే, ఝషే, మీనే, మకరే చ, యాతుః జనస్య పురుషస్య, యాత్రా అర్థదా, యుద్ధే తు గవి వృషభే, హరౌ సింహే, చాపే ధనుషి, అజే మేషే చ, శౌర్యాయుష్యధనప్రదా భవతి.

అవ. సర్వయాత్రావిషయమై లగ్ననిర్ణయమును జెప్పుచున్నాఁడు.—

తా. వృషభ, కన్యా, మిథునరాసులయందు స్త్రీయాత్ర సుఖప్రద మనియు; తులా, వృషభ, మేష, సింహ, మకరరాసులయందు గోయాత్ర పోవువారలకు పశులాభప్రద మనియు; కుంభ, కర్కట, మీన, మకరరాసులయందు ద్రవ్యార్థియై వెళ్లెడివానికి ధనప్రద మనియు;

వృషభ, సింహ, ధనుర్మేషరాసులయందు యుద్ధమునకుఁ బోవువానికి శౌర్యాయుష్యధనప్రదములు.

అవ. యుద్ధగమనకాలే రాహుస్థితిఫలమాహ.—

వారేఽర్కస్య గురోర్దినే సురపతేస్తత్కాలహోరాసు వా
యుద్ధే వా భృగుచంద్రయోర్యమదిశం భౌమే దినే వారుణీమ్,
సౌమ్యాం భానుజసౌమ్యయోస్తుకలహస్స్యాత్కాలరాహుస్త్వయం
స్యాత్తాం లాభజయౌ ప్రయాతురథవా చేద్వామగః పృష్ఠగః.179

వ్యా. వార ఇతి. అర్కస్య వారే భానువారే, గురోర్దినే గురువారే చ, తత్కాలహోరాసు, అత్ర బహువచనేన భాన్వాదిసకలవారేషు తత్తద్వారాధిపతి హోరాస్విత్యర్థో లభ్యతే. రవిగురుహోరయోశ్చ, సురపతేరింద్రస్య దిశం ప్రాగ్దిశం ప్రతి, యుద్ధే ప్రయాతుః యుద్ధస్య ప్రయాతురిత్యర్థః. కలహస్స్యాత్. అతస్త ద్వారయోః ప్రాచీం దిశం న వ్రజేత్, తద్వారయోః తత్ర దిశి రాహోస్సత్వా దితి భావః. భృగుచంద్రయోశ్శుక్రసోమవారయోః. తద్ధోరయోశ్చ యమదిశం దక్షిణాం దిశం న వ్రజేత్. తత్ర కాలరాహోస్సత్వాదితి హేతుస్సర్వత్ర యోజ్యః. భౌమే దినే తద్ధోరాయాం వారుణీం ప్రతీచీం దిశం న వ్రజేత్. భానుజ సౌమ్యయోస్తు శనిబుధవారయోః తద్ధోరయోశ్చ సౌమ్యాముదీచీం దిశం న గచ్ఛేత్, అయం కాలరాహుః యుద్ధప్రయాతుః, వామగః పార్శ్వగతో వా పృష్ఠగతో వా యది లాభజయౌ స్యాతామ్.

అవ. యుద్ధమునకుఁ బోవునపుడు రాహుస్థితికి ఫలమును జెప్పు చున్నాఁడు. —

తా. భానుగురువారములయందును భానుగురుహోరలయందును రాహువు తూర్పుదిక్కున నుండునుగాన నీవారహోరలయం దాదిక్కునకును శుక్రసోమవారములయందును వానిహోరలయందును రాహువు దక్షిణమం దుండును గాన నీవారహోరలయం దాదక్షిణదిక్కునకును, అంగారకవారమందును వానిహోరయందును రాహువు పశ్చిమంబున నుండునుగాన నావారహోరలయందుఁ బశ్చిమదిక్కునకును, శనిబుధవార ములయందును వానిహోరలయందును రాహు వుత్తరంబున నుండును గాన నీవారహోరలయం దీదిక్కునను యుద్ధయాత్రపోవువారలకు మిక్కిలి కలహంబు గలుగు ననియు, కాలరాహువు యుద్ధమునకు వెళ్లు

నపుడు ప్రయాణకర్తకు నిరుపార్శ్వములయం దుండినను వెనుక నుండి నను లాభజయకరుఁ డగును.

అవ. అథ ద్వాభ్యాం స్థిరచరయోగిన్యోః ఫలమాహ.—

పక్షాదిర్నవమీ చ దుఃఖభయదే ప్రాచీం ప్రయాతుస్తయో
రానంతర్యతిథీ కుబేరకకుభం త్వాగ్నేయ కాష్ఠాంతయోః,
ఆనంతర్యదినే తయోః పరదినే రక్షోదిశం పంచమీ
రాకా వాయుదిశం చతుర్దశదినం షష్ఠీ దిశం వారుణీం. 180

యామ్యామాయకృత్త్రయోదశదినం స్యాత్సప్తమీ త్వష్టమీ
దర్శశ్చేశదిశం ప్రయాణసమయే హ్యేషా స్థిరా యోగినీ,
పాదోనం ఘటికాచతుష్టయమితా ప్రాగాదిపష్ఠాంతగా
స్యాదేషా చరయోగినీ నిధనకృద్భానూదయాన్నిత్యశః. 181

వ్యా. పక్షాదిరితి. యామ్యామితి చ—పక్షాదిః ప్రతిపత్, నవమీ చేత్యేతే ప్రాచీం ప్రయాతుః, దుఃఖభయదే భవతః, ఏవం చ తయోః ప్రతిపన్నవమ్యోః, ఆనంతర్యతిథీ క్రమాత్ ద్వితీయదశమ్యౌ, కుబేరకకుభం కుబేరస్య కకుభముదీచీం దిశమిత్యర్థః. 'దిశస్తు కకుభః కాష్ఠా' ఇత్యమరః. ప్రయాతుః పూర్వవద్దుఃఖభయదే, తయోర్ద్వితీయదశమ్యోరనంతరదినే తృతీయైకాదశ్యౌ, ఆగ్నేయకాష్ఠాం ఆగ్నేయదిశం, ప్రయాతుః పూర్వవద్దుఃఖభయదే తృతీయైకాదశ్యోః పరదినే చతుర్థీ ద్వాదశ్యౌ రక్షోదిశం నైరృతిదిశం ప్రయాతుః పూర్వవద్దుఃఖభయదే, పంచమీ ప్రసిద్ధా రాకాపౌర్ణమాసీ చేత్యేతే దినే వాయుదిశం వాయవ్యాం ప్రయాతుః పూర్వవద్దుఃఖభయదే, చతుర్దశదినం చతుర్దశషష్ఠీదినం చేత్యేతే వారుణీం వరుణస్యేమాం దిశం 'తస్యేద' మిత్యణ్ 'టిడ్ఢాణ' ఇత్యాదినా ఙీప్. ప్రతీచీం దిశం యాతుర్దుఃఖభయదే స్యాతామితి సర్వత్రానుషంగః. త్రయోదశ దినం త్రయోదశీ సప్తమీ చ యామ్యాం దక్షిణదిక్ప్రయాతుః ఆమయకృత్ రోగకృత్స్యాత్. అష్టమీ దర్శశ్చ ఈశదిశం ఈశాన్యాం దిశం యాతుః ఆమయ కృద్రోగకృత్స్యాత్, ప్రయాణసమయే ఏషైవ స్థిరా యోగినీ. అథ చరయోగినీ మాహ.—నిత్యశః ప్రతిదినం, భానూదయాత్సూర్యోదయాదారభ్య, చరయోగినీ పాదోనం ఘటికాచతుష్టయమితా సతీ ప్రాగాదిషష్ఠాంతగా, అయమాశయః, సూర్యోదయానంతరం పాదోనం ఘటికాచతుష్టయం ప్రాచ్యాం, తతస్తావతాకాల మేవ తస్యాః షష్ఠ్యాం వాయవ్యాం, తతస్తస్యాః షష్ఠ్యాం దక్షిణస్యాం, తతః తస్యాః షష్ఠ్యామైశాన్యాం, తతః తస్యాః షష్ఠ్యాం ప్రతీచ్యాం, తతస్తస్యాః షష్ఠ్యాం ఆగ్నేయ్యాం, తతస్తస్యాః షష్ఠ్యాముదీచ్యాం, తతస్తస్యాః షష్ఠ్యాం

నైరృత్యాం, ఏషా చరయోగినీ సంచరతీ సతీ, అభిముఖం యాతుః నిధనకృద్భవతీతి సర్వమవధాతవ్యమ్.

అవ. రెండుశ్లోకములచే స్థిరచరయోగినులకు ఫలములఁ జెప్పుచున్నాఁడు.—

తా. పాడ్యమీనవములు తూర్పుదిక్కునను విదియదశమలు ఉత్తరమునను తదియైకాదసు లాగ్నేయదిక్కునను చతుర్థిద్వాదసులు నైరృతిదిక్కునను పంచమిపున్నమలు వాయవ్యదిక్కునను చతుర్దశీషష్ఠులు పశ్చిమదిక్కునను త్రయోదశీసప్తములు దక్షిణంబునను అమావాస్యాష్టమ లీశాన్యదిక్కునను స్థిరయోగిని యుండుఁగాన నీదివసములయం దీదిక్కులకుఁ బైనము పోవువారలకు దుఃఖభయంబులు గలుగును. చరయోగిని ప్రతిదినమందు సూర్యోదయప్రభృతి సూర్యాస్తమయపర్యంతము తూర్పున 3¾ ఘడియలును వాయవ్యమున 3¾ ఘడియలును దక్షిణంబున 3¾ ఘడియలును ఈశాన్యంబున 3¾ ఘడియలును దీని కాలవదగు పశ్చిమంబునను దాని కాలవదైన యాగ్నేయంబునను దాని కాలవదగు నుత్తరంబునను ఆయుత్తరమున కాలవదగు నైరృతిదిక్కునందును చరయోగిని యిట్లు సంచరించుచుండుఁ గాన నీయోగిని కభిముఖముగఁ బైనము పోయిరేని మరణము గలుగును.

అవ. పక్షచ్ఛిద్రేషు వర్జ్యకాలమాహ.—

విఘ్నేశశ్చ చతుర్దశీ చ నవమీ షష్ఠ్యష్టమీ ద్వాదశీ
నాగాస్తత్త్వచతుర్దశాంకమనుదిఙ్నాడ్యః క్రమాద్రోగదాః,
సంఖ్యోర్ధ్వా ఘటికాశ్శుభాశ్చ తిథయః షట్పక్షరంధ్రాభిధాః
మాసాద్యంతదినద్వయం తు మృతికృత్సర్వేషు కర్మస్వపి. 182

వ్యా. విఘ్నేశశ్చేతి. విఘ్నేశశ్చతుర్థీ చతుర్దశీ చ నవమీ షష్ఠ్యష్టమీ ద్వాదశీ చ ఏతాః ప్రసిద్ధాః. ఏతాసు నాగాస్తత్త్వచతుర్దశాంకమనుదిఙ్నాడ్యః క్రమాద్రోగదాః, చతుర్థ్యాం నాగాః అష్టౌ, చతుర్దశ్యాం తత్త్వం పంచవింశతిః, నవమ్యాం చతుర్దశ, షష్ఠ్యాం అంకః నవ, అష్టమ్యాం మనుశ్చతుర్దశ, ద్వాదశ్యాం దిక్ దశ, ఏతత్సంఖ్యాకానాడ్యః ఘటికాస్త్యాజ్యా ఇత్యాశయః. సంఖ్యోర్ధ్వాః, ఉక్తసంఖ్యోర్ధ్వాః, ఘటికాః శుభాః, షట్తిథయః విఘ్నేశాదితిథయః, పక్షరంధ్రాభిధాః పక్షచ్ఛిద్రసంజ్ఞకాః పక్షే పక్షే చ జ్ఞేయాః మాసాద్యంతదినద్వయం మాసాదిః శుక్లప్రతిపత్, అంతదినం అమావాస్యా, తయోః ద్వయం సర్వేషు కర్మసు శుభకర్మసు, మృతికృత్.

అవ. పక్షచ్ఛిద్రములయందు వర్జ్యకాలము చెప్పుచున్నాఁడు.—

తా. చతుర్థియందు మొదట ౮ గడియలును, చతుర్దశియందు ౨౫ గడియలును, నవమియందు ౧౮ గడియలును, షష్ఠియందు ౬ గడియలును, అష్టమియందు ౧౮ గడియలును, ద్వాదశియందు ౧౦ గడియలు నశుభకరములుగాన శుభకార్యములవిషయమై యీదినములయందీగడియలు నిషేధింపఁదగిన వనియు, నీయాఱుదినములయందు మిగిలిన గడియలు శుభకరంబు లనియు నీ చెప్పఁబడిన విఘ్నకారిషట్తిథులే ప్రతి పక్షమందును పక్షచ్ఛిద్రసంజ్ఞగల వనియును, శుక్లపాడ్యమి, అమావాస్య ఈ రెండుదినములు సర్వశుభకర్మలవిషయమై మృత్యుప్రదములుగాన సర్వదా నింద్యము లనియు నభిప్రాయము.

అవ. అథ గమననిషిద్ధనక్షత్రేషు వర్జ్యకాలమాహ.—

శాక్రే సప్త నవేశ్వరే దశ యమే పూర్వాత్రయే షోడశ
త్వాష్ట్రే పంచదశానలే నవ దశ ద్వావింశతిః పైతృభే,
స్వాతౌ ద్వాదశ సార్పభే నవ దశైవైంద్రాగ్ని భే తారకా
స్త్వేతా యాతృభయా_ర్తిదా అథ శుభాస్సంఖ్యోత్తరా నాడికాః.

వ్యా. శాక్ర ఇతి. శాక్రే జ్యేష్ఠాయాం సప్త, ఈశ్వరే ఆర్ద్రాయాం నవ, యమే భరణ్యాం దశ, పూర్వాత్రయే పూర్వఫల్గునీపూర్వాషాఢాపూర్వాభాద్రాసు షోడశ, త్వాష్ట్రే చిత్రాయాం పంచదశ, అనలే కృత్తికాయాం నవదశ ఏకోనవింశతిః, పైతృభే మఘాయాం ద్వావింశతిః, స్వాతౌ ద్వాదశ, సార్పభే ఆశ్రేషాయాం నవదశ ఏకోనవింశతిః, ఐంద్రాగ్నిభే విశాఖాయాం తారకాః సప్తవింశతిః, ఏతాః నాడికాః, ఘటికాః యాతృభయా_ర్తిదాః. అథ సంఖ్యోత్తరా నాడికాః, నిషిద్ధనక్షత్రే షూక్త సంఖ్యాతిరిక్తఘటికాస్తు శుభప్రదాః.

అవ. గమననిషిద్ధనక్షత్రములయందు వర్జ్యకాలమును జెప్పుచున్నాఁడు.—

తా. జ్యేష్ఠానక్షత్రమందు ౭, ఆర్ద్రయందు ౯, భరణియందు ౧౦, పూర్వఫల్గుని పూర్వాషాఢ పూర్వాభాద్రలయందు ౧౬, చిత్తయందు ౧౫, కృత్తికయందు ౧౯, మఘయందు ౨౨, స్వాతియందు ౧౨, ఆశ్రేషయందు ౧౯, విశాఖయందు ౨౭ యీక్రమంబున నీ నక్షత్రములయందీగడియలు ప్రయాణవిషయమయి దుఃఖభయప్రదము లనియు, ఉక్త సంఖ్యాతిరిక్తఘటికలు శ్రేష్ఠతమము లనియు నభిప్రాయము.

అవ. దినభుక్తి వారభుక్తిస్వరూపమాహ.—

దధ్యాజ్యాన్నయవాంబుమాషచణకక్షౌద్రేక్షుపిష్టార్ద్రక
క్షీరవ్యంజనముద్గపాయసతిలాభుక్తిర్దినాద్యాదితః,
తక్రం పాయసకాంచికే దధి పయో దుగ్ధం తిలాన్నం క్రమా
ద్వారాద్యంశుమతః ప్రయాత్రసుఖకృత్స్యా వారభుక్తిర్భవేత్. 184

వ్యా. దధీతి. దినాద్యాదితః ప్రతిపత్ప్రభృతి పూర్ణిమాసహితదర్శాంత షోడశ దినేషు, దధ్యాజ్యాన్నయవాంబుమాషచణకక్షౌద్రేక్షుపిష్టార్ద్రక క్షీరవ్యంజనముద్గపాయసతిలాః యే పదార్థాః, తేషాం క్రమాత్ భుక్తిర్భోజనం, దినభుక్తిరిత్యుచ్యతే. అంశుమతో వారాది భానువాసరప్రభృతి సప్తవారేషు, క్రమాత్ తక్రం పాయసకాంచికే పాయసం చ కాంచికం చ పాయసం ప్రసిద్ధం కాంచికం ధాన్యామ్లం ఆంధ్రభాషాయాం (కలి)ఇత్యుచ్యతే, 'అవంతి సోమధాన్యామ్లకుంజలాని చ కాంచిక' ఇత్యమరః. దధి పయః దుగ్ధం, తిలాన్నం, ఏతేషాం యా భుక్తిః సా వారభుక్తిః ప్రయాతుస్సుఖకృద్భవేత్, భానువారే తక్రం పీత్వాగమ్యతే చేత్ యాత్రా సుఖకృత్స్యాదితిగమ్యతే. ఏవం దినభుక్తిస్థలేఽప్యూహ్యం. ఇయమేవ వారభుక్తిరిత్యుచ్యతే, నన్వేవం వారభుక్త్యైవ చరితార్థత్వాద్దినభుక్త్యుపన్యాసో నిరర్థక ఇతి చేన్న; దినోక్తవారోక్తపదార్థద్వయం భుక్త్వాగంతవ్యమిత్యాశయాత్, ఏషైవభుక్తిర్వక్ష్యమాణనక్షత్రభుక్తిస్థలేఽప్యూహ్యమ్.

అవ. దినవారభుక్తులస్వరూపమును జెప్పుచున్నాఁడు.—

తా. ప్రైనముఁబోవువారలు పాడ్యమి మొదలు పున్నమ అమావాస్యలతోఁ గూడ ౧౬ దివసములయందును పెరుఁగు, నెయ్యి, అన్నము, గోధుమలు, ఉదకము, మినుములు, సెనగలు, క్షౌద్రము, చెఱకు, పిష్టము, ఆర్ద్రకము, పాలు, వ్యంజనము, పెసలు, పాయసము, నువ్వులు ఈ ౧౬ పదార్థములును క్రమంబుగానొక్కొక్కదివసమునం దొక్కొక్క పదార్థమును భుజించి ప్రైనముఁబోవలయుననియు తక్రము, పాయసము, కలి, పెరుఁగు, పాలు, దుగ్ధము, తిలాన్నమీసప్తవిధపదార్థములను భానువారప్రభృతిస్థిరవారమువఱకు నొక్కొక్కవారమునం దొక్కొక్క పదార్థమును భుజింపవలయు ననియు, నీదినభుక్తిని వారభుక్తిని చెప్పుట వలన దినవారభుక్తిప్రతిపాదకపదార్థద్వయమును భుజించి ప్రైనము పోయిరేని సుఖవంతు లగుదు రనియు నెఱుఁగవలయు.

కుల్మాషా స్తిలతండులా దధి ఘృతం దుగ్ధం చ మార్గామిషం
తత్సారం ఘృతపాయసం చ పృథుకా మాంసం మృగేణ్యా మధు,
శాకం పైష్టికమోదనం బహువిధం ధాత్రీఫలం మండపం
పిష్టాన్నం కదలీఫలం శశశిరోమాంసం కుళుత్థౌదనమ్. 185
నైవారం కృసరౌదనం ఝషయుతం చాన్నం సముద్గౌదనం
శాల్యన్నం చ యవాన్నమిష్టమశనం దస్రాదిభుక్తిః క్రమాత్,
సాజ్యాన్నం కృసరాన్నమాదిదివసే ప్రాగాది భుక్త్వా వ్రజే
న్మత్స్యాన్నం ఘృతపాయసం చ గమనే దిగ్భుక్తిరేషా క్రమాత్.

వ్యా. కుల్మాషా ఇతి. నైవారమితి. కుల్మాషాశ్చణకాః, 'స్యాద్యావకస్తు కుల్మాషశ్చణకో హరిమంథక' ఇత్యమరః. తిలాః తండులాః దధి ఘృతం ఆజ్యం, దుగ్ధం క్షీరం, మార్గామిషం మృగసంబంధిమార్గం తచ్చ యత్ ఆమిషం మృగమాంసం, తత్సారం మృగమాంససారం, ఘృతపాయసం ఘృతసహితక్షీరాన్నం, పృథుకాః మృగేణ్యాః ఏణీమృగస్య, 'రాజదంతాదిషు పర' మితి మృగశబ్దస్య పూర్వనిపాతః. తస్య మాంసం, మధు, శాకం చ ప్రసిద్ధం, పైష్టికం మద్యవిశేషః, ఓదనం బహువిధం కృసరాన్నమితి యావత్, ధాత్రీఫలం ఆమలకం. 'ధాత్రీ స్యాదుపమాతాపి క్షితిరప్యామలక్య' పీత్యమరః. మండపం భక్ష్యవిశేషః, పిష్టాన్నం కదలీఫలం శశశిరోమాంసం, కుళుత్థౌదనం, నైవారం నీవారాన్నం, కృసరౌదనం, ఝషయుతం మత్స్యసహితమన్నం, సముద్గౌదనం ముద్గసహితాన్నం, శాల్యన్నం శాలయో వ్రీహివిశేషాః తేషామన్నం, యవాన్నమితి. ఇష్టమశనం, దస్రాదిభుక్తిః, అశ్వినీప్రభృతి అభిజిత్సహితాష్టావింశతినక్షత్రాణాం భుక్తిః, క్రమాత్ జ్ఞేయా. అశ్విన్యాం గంతుమిచ్ఛుః కుల్మాషాన్భుక్త్వా గచ్ఛతి చేదిష్టసిద్ధిర్భవేత్ ఏవమష్టావింశతినక్షత్రాణాముక్తరీత్యావగంతవ్యం. అథ దిగ్భుక్తిమాహ.—సాజ్యాన్నం ఘృతప్లుతాన్నం, కృసరాన్నం చిత్రాన్నమితి ప్రసిద్ధం, మత్స్యాన్నం మత్స్యసహితాన్నం, ఘృతపాయసాన్నం, ఘృతసంయుక్తక్షీరాన్నం, ఆదిదివసే ప్రయాణప్రథమదివసే, భుక్త్వా వ్రజేత్. ప్రాగ్గమనవేళాయాం సాజ్యాన్నం, దక్షిణే కృసరాన్నం, పశ్చిమే మత్స్యాన్నం, ఉదగ్గ్గమనే ఘృతపాయసాన్నం, భుక్త్వా వ్రజేదిత్యాశయః. గమనే ప్రయాణవిషయే ఏషా భుక్తిరాదరణీయా.

అవ. రెండుశ్లోకములచేత నక్షత్రదిగ్భుక్తులఁ జెప్పుచున్నాఁడు.—

తా. సెనగలు, నువ్వులు, బియ్యము, పెరుఁగు, నెయ్యి, పాలు, మృగమాంసము, మృగమాంససారము, ఘృతసహితక్షీరాన్నము, అడుకులు, లేడిమాంసము, శాకము, పైష్టికమను మద్యవిశేషము, అన్నము,

చిత్రాన్నము, ఉసిరికపండ్లు, అరటిపండ్లు, కుందేటి శిరోమాంసము, ఉలవలతోఁ గలిపినయన్నము, నీవారాన్నము, కృసరాన్నము, మత్స్య సహితాన్నము, పెసలపప్పన్నము, పిశాణబియ్యపుటన్నము ఈ ౨౭ పదార్థము లశ్విన్యాది ౨౭ నక్షత్రములయం దొక్కొక్కనక్షత్రమునం దొక్కొక్కపదార్థమును భుజించి పైనము పోయిరేని యిష్టసిద్ధి గలుగును. తూర్పుదిక్కునకుఁ బైనము పోవువా రాజ్యసహితాన్నమును, దక్షిణమునకుఁ బోవుసమయమునఁ గృసరాన్నము, పశ్చిమమునకుఁ బోవుసమయమున మత్స్యాన్నము, ఉదగ్దిగ్గమనసమయమున ఘృతసహిత క్షీరాన్నమును ప్రయాణదివసమునకుఁ బూర్వదినమందు భోజనముచేసి పోవలయును. ప్రయాణవిషయమై ఉక్తనక్షత్రభుక్తి దిగ్భుక్తియును మిక్కిలి యావశ్యకము.

అవ, అథ చంద్రద్వాదశావస్థా ప్రచారద్వయమాహ.—

షష్ఠీఘ్నం గతధిష్ణ్యమిందుఘటికాస్సంయుజ్య రాశిం పున
ర్వేదఘ్నం శరసాగరాప్తమినతో భక్త్వాఽథ లబ్ధం క్రమాత్,
మేషాదౌ తు గృహే గృహే శశభృతో జ్ఞేయా అవస్థా ద్విష
డ్దస్రాదిష్వథ పాదయుక్తఘటికా స్త్వేకాద శై కాదశ. 187

వ్యా. షష్ఠీఘ్నమితి. గతధిష్ణ్యం అశ్విన్యాదిప్రకృతనక్షత్రాంతాని గతధిష్ణ్యాని తేషాం సంఘః తద్ధిష్ణ్యం, షష్ఠీఘ్నం షష్ట్యా సంగుణితం, కృత్వా తత్ర ఇందుఘటికాః వర్తమాననక్షత్రఘటికాః, సంయుజ్య రాశిః, కార్యః, తం రాశిం పునర్వేదఘ్నం చతుర్గుణితం కృత్వా, శరసాగరాప్తం చ చత్వారింశద్విభక్తం కుర్యాత్, అథానంతరం విభాగతః యల్లబ్ధం పునః ఇనతః ద్వాదశభిః భక్త్వా విభజ్య, తల్లబ్ధం, మేషాదౌ గృహే గృహే మేషప్రభృతిప్రతిరాశౌ, క్రమాత్ శశభృతః చంద్రస్య, ద్విషట్ ద్వాదశసంఖ్యాకా అవస్థా జ్ఞాతవ్యా ఇత్యేకః పక్షః, పక్షాంతరమాహ.—అథవా దస్రాదిష్వశ్విన్యాదిషు ఏకైకావస్థాయాః పాదయుక్తఘటికాః సపాదఘటికాః ఏకాదశైకాదశేతి మూలప్రకారోఽన్యః మమ తు ప్రతిభాతి, చంద్రో యదా రాశిం ప్రవిష్టో భవతి తదారభ్య సపాదైకాదశఘటికాః ప్రత్యవస్థాయాః జ్ఞాతవ్యాః ఇతి సులభతరః. అశ్విన్యాదిగతనక్షత్రాణి షష్ట్యా సంగుణ్య తేషు వర్తమానఘటికాః, సంయుజ్య పంచత్రింశోత్తరశతేన విభజ్యతే చేత్, శేషం సపాదైకాదశఘటికాః క్రమేణ ఏకైకావస్థాయాం జ్ఞాతవ్యా ఇతి సులభతమోపాయఇతి దిక్.

అవ. గ్రంథకర్త యిష్టానుసారముగఁ జంద్రద్వాదశావస్థలనిర్ణయ మును జెప్పుచున్నాఁడు.—

తా. జనులు ప్రయాణముపోవునక్షత్రమువఱకు నశ్విన్యాదిగత నక్షత్రములను ౬౦ ట ఎచ్చగుణించి యీగుణకములో నిత్యనక్షత్ర ములోఁ బ్రయాణకాలమువఱకు గతించిన ఘడియలను గూడఁ జేర్చి యొకరాశిచేసి దాని ౪ ట గుణించి ౭౫ చే భాగింపఁగా శేషించిన ఘడి యలఁ జంద్రోదయరాశి మొదలుకొని పరశ్లోకమందుఁ జెప్పఁబోయెడి ద్వాదశావస్థల కొక్కొక్కయవస్థకు ౧౧ ఘడియలచొప్పున భాగించి యెన్ని యవస్థలకు సంఖ్యవచ్చునో యాయవస్థలకు నవస్థారూపఫల మును జూచుకొనవలయు నని కాలామృతకారుల యభిప్రాయము.

అవ. అథ చంద్రద్వాదశావస్థానాం నామనిరూపణద్వారా తదను రూపఫలమాహ.—

సూక్ష్మం స్థూలమితి ద్వయోః ప్రవసనం నాశం మృతాఖ్యం జయం
హాస్యం క్రీడితనామకం ప్రియతరం సుప్తిం చ భుక్తిం జ్వరమ్,
కంపం సుస్థిరతాం స్వనామసదృశం చేందోరవస్థాఫలం
యాత్రాయుద్ధవివాహవాస్తుజననక్షేత్రప్రవేశాదిషు. 188

వ్యా. సూక్ష్మమితి. సూక్ష్మం స్థూలమితి ద్వయోః పక్షయోః ప్రవసన, నాశ, మృతాఖ్య, జయ, హాస్య, క్రీడిత, ప్రియరతి, సుప్తి, భుక్తి, జ్వర, కంప, సుస్థిర తేతి చంద్రస్య ద్వాదశావస్థానాం నామాని భవంతి. స్వనామసదృశం తత్తన్నా మాను రూపమిందోశ్చంద్రస్య, అవస్థానాం ఫలం, యాత్రాయుద్ధవివాహవాస్తు జననక్షేత్రప్రవేశాదిషు, యాత్రా ప్రయాణం, యుద్ధం రాజ్ఞామన్యోన్యకలహః, వాస్తు గృహనిర్మాణాది, వివాహః ప్రసిద్ధః, జననం పుత్రజన్మ, క్షేత్రం కృషికర్మ, ప్రవేశః నూతనగృహప్రవేశః, ఏతేషు ద్రష్టవ్యమితి శేషః.

అవ. చంద్రద్వాదశావస్థలకు నామనిరూపణ చేసి నామాను రూపఫలములఁ జెప్పుచున్నాఁడు.—

తా. స్థూలము, సూక్ష్మ మనెడు ద్వివిధపక్షముల ద్వాదశయవస్థ లకు ప్రవసనము, నాశము, మృతాఖ్యము, జయము, హాస్యము, క్రీడి తము, ప్రియరతి, సుప్తి, భుక్తి, జ్వరము, కంపము, సుస్థిరత యనెడు ద్వాదశవిధ నామంబులనియును, చంద్రద్వాదశావస్థలయొక్క నామాను

రూపఫలం బనియును, ప్రయాణ, యుద్ధ, వివాహ, గృహనిర్మాణ పుత్రజన్మ, కృషికర్మ, నూతనగృహప్రవేశాదులయందే ద్వాదశావస్థాను రూపఫలవిచార మావశ్యక మనియు నెఱుఁగునది.

అవ. ఖచరయోగఫలమాహ.—

అర్కాక్రాంతభత స్తృతీయనవమే చాతుర్థభం పంచమం
చైతద్ధిష్ణ్యచతుష్టయం తు ఖచరో నామా భవే త్తత్ఫలమ్,
సీమంతే సవనే వ్రతే శిశుహరం ని స్తండులత్వం కృషౌ
వైధవ్యం కరపీడనే చ గమనే కుర్యాత్ప్రయాతుర్వధమ్. 189

వ్యా. అర్కేతి. అర్కాక్రాంతభతః సూర్యాధిష్ఠితనక్షత్రాత్, తృతీయ నవమే, చాతుర్థభం, చతుర్థనక్షత్రం, పంచమం పంచమనక్షత్రం చేతి చతుష్టయం, ఖచరో నామ ఖచరాఖ్యో యోగో భవేత్, అయం ఖచరయోగః, సీమంతే ప్రసిద్ధే, సవనే పుంసవనే వ్రతే ఉపనయనే చ, శిశుహరణరూపం, తత్ఫలం, కృషౌ హలకర్మణి, ని స్తండులత్వం ధాన్యాభావం, కరపీడనే వివాహే, వైధవ్యం, గమనే ప్రయాణే, ప్రయాతుః, వధం చ క్రమాత్కుర్యాదద్యాదితి సర్వత్రాధ్యాహార్యః.

అవ. ఖచరయోగఫలమును జెప్పుచున్నాఁడు.—

తా. సూర్యస్థిత నక్షత్రమునకు ౩, ౪, ౯, ౫ ఈ ౪ నక్షత్రములు ఖచరాఖ్యయోగ మనియు, నీఖచరయోగము పుంసవన, సీమంత, ఉపనయనములవిషయమై శిశుహరణరూపఫలమును వ్యవసాయవిషయమై ధాన్యాభావమును వివాహమందు వైధవ్యమును ప్రయాణవిషయమై పైనముఁ బోవువానికి మరణము నీక్రమంబుగఁ గలుగఁజేయును.

అవ. అథ కర్మణి ఫలమాహ.—

సూర్యాధిష్ఠితతారకాది గణయేచ్చాతుర్థభం ఘాతదం
స్యా ద్దేకాదశభం ప్రభంగదమిదం చాష్టాదశం మృత్యుదమ్,
కర్తుస్స్యా దథ పంచవింశమపి భం హానిప్రదం కర్మణి
నామైతద్ధచతుష్టయం తు గమనే పాణిగ్రహాదిష్వపి. 190

వ్యా. సూర్యేతి. సూర్యాధిష్ఠితతారకాది సూర్యస్థితనక్షత్రమారభ్య, గణయేత్, చంద్రస్థితనక్షత్రపర్యంతమితి శేషః. ఏవం గణనాయాం క్రియమాణాయాం చాతుర్థభం సూర్యస్థితనక్షత్రాచ్చతుర్థనక్షత్రం, ఘాతదం నామ, ఏకాదశభం, సూర్యస్థితనక్షత్రాదేకాదశనక్షత్రం, ప్రభంగదం, అష్టాదశం సూర్యస్థిత నక్షత్రాదష్టాదశనక్షత్రం, మృత్యుదం, పంచవింశం భమపి సూర్యస్థితనక్షత్రా

త్పంచవింశనక్షత్రం చ హానిదం, ఏతత్ కర్మణి నామకర్మణి సంజ్ఞకం, భచతుష్టయం ఉక్తనక్షత్రచతుష్టయం, కర్తుః గమనే పాణిగ్రహాదిష్వపి, వివాహాదిశుభకర్మసు చ, తత్తత్ఫలం స్యాత్, సూర్యస్థితనక్షత్రాచ్చతుర్థాకాదశాష్టాదశపంచవింశతినక్షత్రేషు శుభకర్మ న కుర్యా దిత్యాశయః.

అవ. కర్మణిఫలమును జెప్పుచున్నాఁడు.—

తా. సూర్యస్థితనక్షత్రము మొదలు చంద్రస్థితనక్షత్రమువఱకు గణనచేయఁగాఁ సూర్యస్థితనక్షత్రమునకు నాల్గవనక్షత్రము ఘాతదమనియు, పదునొకండవనక్షత్రము భంగద మనియు, పదునెనిమిదవనక్షత్రము మృత్యుప్రదమనియు, ఇరువదియైదవనక్షత్రము హానిద మనియు ఈచెప్పఁబడిన నాలుగునక్షత్రములు కర్మణి యనుసంజ్ఞ గల వనియు నిది ప్రయాణవివాహాదిశుభకర్మలవిషయమై ఉక్తఫలంబులఁ గ్రమంబుగ నిచ్చును గాన నీనక్షత్రచతుష్టయమందు నేశుభకార్యములును జేయఁగూడదు అని తాత్పర్యము.

అవ. స్వరచక్రోక్తబాల్యాద్యవస్థావివేకమాహ.—

యన్నామప్రథమాక్షరస్వరముఖా జ్ఞేయా అకారాదయో
బాలో యౌవనరాజ్యవృద్ధమృతయస్స్వస్వాదిపంచాభిధాః,
క్లృప్తా దృష్టిరకారఏవ గదితో ద్వైవస్త్వికారో భవే
త్ప్రాగ్ధాఖ్యాదిరుకార ఏవముభయో రేకార ఓకారకే. 191

వ్యా. యదితి. యస్య నామ్ని ప్రథమాక్షరే యః స్వరః తన్ముఖా స్తదాదితః, అకారాదయః అకార ఇకారఉకారఏకారఓకారాః, జ్ఞేయాః జ్ఞాతవ్యాః, ఏతే పంచస్వరాః స్వస్వాది బాల్యయౌవనరాజ్యవృద్ధమృతయ ఇతి. పంచాభిధాః పంచసంజ్ఞా భవంతి. యథా—అకారాదినామ్నః పుంసః అకారో బాలస్వరః, ఇకారః కుమారస్వరః, ఉకారో రాజ్యస్వరః, ఏకారో వృద్ధస్వరః, ఓకారో మృతిస్వరః, ఇకారాదినామ్నః పుంసః ఇకారో బాలః, ఉకారో యువా, ఏకారో రాజ్యః, ఓకారో వృద్ధః, అకారో మృతిః, ఉకారాదినామ్నః పుంసః ఉకారో బాలః, ఏకారో యౌవనః, ఓకారో రాజ్యః, అకారో వృద్ధః, ఇకారో మృతిః, ఏకారాదినామ్నః పుంసః ఏకారో బాలః, ఓకారో యౌవనః, అకారోరాజ్యః, ఇకారో వృద్ధః, ఉకారో మృతిః, ఓకారాదినామ్నః పుంసః ఓకారో బాలః, అకారో యౌవనః, ఇకారో రాజ్యః, ఉకారో వృద్ధః, ఏకారో మృతిః, అకార

ఏవ దృష్టిః బాలాఖ్యాక్షప్తౌ సిద్ధా ఇకారో దైవః, యౌవనాఖ్యో గదితః ఉక్తః. ఉకారో ప్రౌఢాఖ్యో భవేత్ ఓకారే ఏకారే చ ఉభయోః వృద్ధమృత్యోః ప్రౌఢాఖ్యే ఏవ భవేతామితి సూక్ష్మదృశావగంతవ్యం. విస్తరస్తు స్వరోదయే ద్రష్టవ్యః. విస్తరభయాన్నేహ లిఖ్యతే.

అవ. స్వరచక్రమందుఁ జెప్పఁబడిన బాలాదిస్వరవివేకమును జెప్పు చున్నాఁడు.—

తా. అకార, ఇకార, ఉకార, ఏకార, ఓకారము లనుపంచస్వరములలో నేస్వరము నామధేయప్రథమాక్షరమందుఁ గలదో, ఆస్వరము మొదలైదుస్వరములకు బాల్య, యౌవన, రాజ్య, వృద్ధమృతులను పంచవిధనామంబు లవి యెట్లనఁగా; అకారాదినామంబు గలపురుషునికి అకారము బాలస్వరము, ఇకారము కుమారస్వరము, ఉకారము రాజ్యస్వరము, ఏకారము వృద్ధస్వరము, ఓకారము మృతిస్వరము, ఇకారాదినామంబుగల పురుషునికి ఇకారము బాలస్వరము, ఉకారము యౌవనస్వరము, ఇత్తెఱంగున మిగిలిన స్వరంబులకు స్వస్వాదిగా బాలాదిస్వరవివేకము నెఱుంగవలయుననియు, అకారాదిపంచస్వరములకు స్వస్వాదిగా దృష్టి, దైవ, ప్రౌఢ, ప్రౌఢ, ప్రౌఢ లనుపంచవిధావస్థలు గలవు. వానివిషయ మీగ్రంథమందు సూక్ష్మముగఁ జెప్పఁబడియున్నది గాన స్పష్టముగఁ దెలుసుకొన నిచ్ఛయించువారు స్వరోదయమను గ్రంథమునఁ దెలిసికొనవచ్చు ననుట.

అవ. తత్ఫలతారకతిథివారకాలాదీనాం బాలాదిస్వరూపమాహ.—

అల్పార్థాధికలాభహానిమరణం కుర్యుస్స్వబాలాదయః
పంచ ద్వ్యబ్ధ్యృక్ష పంచ పంచ భగణా దస్రాది నందాద్యపి,
వారాః పంచవిధాః స్యుర్యర్కకుజయోశ్చంద్రజ్ఞయోర్వాక్పతే
శ్శుక్రస్యార్కసుతస్య పంచ సమయాస్స్యుః ప్రాతరాద్యాస్స్వరాః.

వ్యా. అల్పేతి. స్వబాలాదయః స్వరాః, క్రమాత్ అల్పార్థాధికలాభహాని మరణ మితి ఫలాని కుర్యుః, యథా బాలస్వరః అల్పం స్వల్పలాభం యౌవనస్వరః అర్థాధికం అర్థేనాధికం అధికార్థలాభమితి యావత్, రాజ్యస్వరో లాభం ఫల ప్రాప్తిం. వృద్ధస్వరో హానిం, మృతిస్వరో మరణం కుర్యాదిత్యాశయః. పంచద్వ్యబ్ధ్యృక్ష ఋతవః షట్ పునఃఋతవ షట్, పునః పంచ, పునరపి పంచభగణాః,

నక్షత్రగణాః, దస్రాది అశ్విన్యాదయః బాలాదయో భవంతి యథావా, అశ్విన్యాది పంచకం అకారస్య బాలస్వరం, ఆర్ద్రాదిషట్కం యౌవనాఖ్యం, ఉత్తరాది షట్కం రాజ్యం, జ్యేష్ఠాదిపంచకం వృద్ధాఖ్యం, ధనిష్ఠాదిపంచకం మృతాఖ్యం, ఇకారస్య ఆర్ద్రాదిషట్కం బాలాఖ్యం, ఉత్తరాదిషట్కం యౌవనాఖ్యం, జ్యేష్ఠాది పంచకం రాజ్యాఖ్యం, ధనిష్ఠాదిపంచకం వృద్ధాఖ్యం, అశ్విన్యాదిపంచకం మృతాఖ్యం, ఉకారస్య ఉత్తరాదిషట్కం బాలాఖ్యం, ఏవమన్యత్రాప్యూహ్యం. నందాద్యపి నందాదిపంచకతిథయః, అకారాదీనాం క్రమాద్బాలాదయో భవంతి. అకారస్య నందతిథిః బాలాఖ్యః, భద్రో యౌవనాఖ్యః, జయో రాజ్యాఖ్యః, రిక్త తిథిః వృద్ధాఖ్యః, పూర్ణతిథిః మృతాఖ్యః, ఇకారస్య భద్రాదిపంచతిథయో బాలా దయో భవంతి, ఉకారస్య జయాదిపంచతిథయః బాలాదయో భవంతి, ఏకారస్య రిక్తాదిపంచతిథయః, ఓకారస్య పూర్ణాదిపంచతిథయః క్రమేణ బాలాదయోభవంతి. వారాః పంచవిధాస్స్యుః. యథా.—అర్కకుజయోరేకవిధః, చంద్రజ్ఞయోరేక విధః, వాక్పతేర్గురోరేకవిధః, శుక్రస్యైకవిధః, అర్కసుతస్య శనేరేకవిధః, ఇత్యే తదుక్తంభవతి, అకారస్య ఆదిత్యభౌమవాసరౌ బాలాఖ్యౌ, సోమబుధవాసరౌ యౌవనాఖ్యౌ, గురువాసరో రాజ్యాఖ్యః, శుక్రవాసరో వృద్ధాఖ్యః, శనివాసరో మృతాఖ్యః, ఇకారస్య సోమబుధవాసరౌ బాలాఖ్యౌ, గురుర్యౌవనాఖ్యః, శుక్రో రాజ్యాఖ్యః, శనిః వృద్ధాఖ్యః, ఆదిత్యభౌమౌ మృతాఖ్యౌ. ఏవముత్తరత్రాప్యూ హ్యం, ప్రాతరాద్యాః పంచసమయాః కాలాః బాలాదయో భవంతి. యథా.— అకారస్య ప్రాతఃకాలో బాలాఖ్యః, సంగవో యౌవనాఖ్యః, మధ్యాహ్నో రాజాఖ్యః, అపరాహ్ణో వృద్ధాఖ్యః, సాయంతనకాలో మృతాఖ్యః, ఇకారస్య సంగమాదయో బాలాదయో భవంతి, ఉకారస్య మధ్యాహ్నాదిపంచకాలాః బాలా దయః, ఏకారస్య అపరాహ్ణాదయః, ఓకారస్య సాయంతన ప్రాతస్సంగవమధ్యా హ్నాపరాహ్ణా బాలాదయో భవంతి. ఏతేషాం ఫలాని పూర్వోక్తానీతి దిక్.

అవ. పూర్వశ్లోకమందుఁ జెప్పబడియున్న బాలాదినామములకు ఫలం బులను తిథివారనక్షత్రములకు బాలాదిస్వరూపమును జెప్పుచున్నాఁడు.-

తా. బాలాదిపంచస్వరములలో బాలస్వరము స్వల్పలాభమును, యౌవనస్వరము ధనమును, రాజ్యస్వరము ఫలప్రాప్తిని, వృద్ధస్వరము హానిని, మృతిస్వరము మరణమును, నీక్రమంబునఁ గలుగఁజేయు ననియు, అకారమునకు నశ్విన్యాదిపంచకము బాలస్వరమనియు, ఆర్ద్రాది షట్కము యౌవనస్వరమనియు, ఉత్తరాదిషట్కము, రాజస్వరమని యు, జ్యేష్ఠాదిపంచకము వృద్ధస్వరమనియు, ధనిష్ఠాదిపంచకము మృతిస్వర

మనియు, ఇకారమునకు ఆర్ద్రాదిషట్కము బాలస్వరమనియు, ఉత్తరాది
షట్కము యౌవనస్వరమనియు, శేషం బిత్తెఱంగున నెఱుంగవలయు.
ఉకారమునకు నందాదిపంచతిథులు బాలస్వర మనియు, భద్రాది పంచ
తిథులు యౌవనస్వర మనియు, జయాదిపంచతిథులు రాజ్యస్వర మనియు
నీక్రమంబుననే శేషంబు నెఱుంగవలయును. అకారమునకు భాన్వంగా
రకవారములు బాలస్వరమనియు, సోమ బుధవారములు యౌవనస్వర
మనియు, గురువారము రాజ్యస్వరమనియు, శుక్రవారము వృద్ధస్వర
మనియు, శనివారము మృతిస్వరమనియు, ఇకారమునకు సోమబుధవార
ములు బాలస్వరమనియు, ఉక్తశేషం బిత్తెఱంగున నూహ్యంబులని
యును, ఆకారమునకు ప్రాతఃకాలము బాలస్వరమనియు, సంగమ
కాలము యౌవనస్వరమనియు, మధ్యాహ్నకాలము రాజ్యస్వరమనియు,
అపరాహ్ణకాలము వృద్ధస్వరమనియు, సాయంకాలము మృతిస్వరమనియు,
ఇకారమునకు సంగమకాలము బాలస్వరమనియు శేషం బిత్తెఱంగున
నూహ్యంబు.

అవ. అథ పంచభిశ్శ్లోకైః పంథారాహుచక్రవివక్షయా ధర్మార్థ
కామమోక్షనక్షత్రనిర్ణయమాహ.—

వస్వాద్యార్యవిశాఖమిత్రవరుణాహ్యాఖ్యాశ్చ ధర్మాభిధా
హ్యర్థాఖ్యాస్త్వదితీంద్రకాలపితృభశ్రీశాజపాద్వాయవః,
కామాఖ్యా అభిజిద్భగాగ్ని దనుజాహిర్బుధ్న్యచిత్రేశ్వరా
విశ్వాపాంత్యకరార్యమేందువిధయో మోక్షాభిధాస్తారకాః. 103

వ్యా. వస్వేతి. వస్వాద్యార్యవిశాఖమిత్రవరుణాహ్యాఖ్యాః ధనిష్ఠాశ్వినీపుష్య
విశాఖానూరాధాశతభిషగాశ్లేషా ఇతి సప్తనక్షత్రాణి, ధర్మాభిధాః ధర్మనామ
ధేయాః, అదితీంద్రకాలపితృభశ్రీశాజపాద్వాయవః పునర్వసూ జ్యేష్ఠా భరణీ
మఘాశ్రవణపూర్వాభాద్రాస్వాత్య ఇతి సప్తతారకాః, అర్థాఖ్యాః అర్థ నామ
ధేయాః. అభిజిద్భగాగ్ని దనుజాహిర్బుధ్న్యచిత్రేశ్వరాః అభిజిత్పూర్వఫల్గునీ
కృత్తికా మూలోత్తరా భాద్రా చిత్తార్ద్రా ఇతి సప్తతారకాః, కామాఖ్యాః
కామనామధేయాః, విశ్వాపాంత్యకరార్యమేందువిధయః ఉత్తరాషాఢా పూర్వా
షాఢా రేవతిహస్తోత్తరఫల్గునీ మృగశీర్ష రోహిణ్య ఇతి సప్తతారకాః, మోక్షా
భిధాః మోక్షాఖ్యాః. 'ఆఖ్యాహ్వే అభిధానం చ నామధేయం చ నామ'
చేత్యమరః.

అవ. ఈశ్లోకములచేత పంథారాహూచక్రవిశేషద్వారా ధర్మార్థకామమోక్షనక్షత్రనిర్ణయముం జెప్పుచున్నాఁడు.—

తా. అశ్విని, ధనిష్ఠ, పుష్యమి, విశాఖ, అనూరాధ, శతభిషము, ఆశ్రేష ఈ ౭ నక్షత్రములు ధర్మనక్షత్రము లనియును; పునర్వసు, జ్యేష్ఠ, భరణి, మఘ, శ్రవణము, పూర్వాభాద్ర, స్వాతి ఈ ౭ ను నర్థనక్షత్రము లనియును; అభిజిత్తు, పూర్వఫల్గుని, కృత్తిక, మూల, ఉత్తరాభాద్ర, చిత్త, ఆర్ద్ర ఈ ౭ కామనక్షత్రము లనియు; ఉత్తరాషాఢ, పూర్వాషాఢ, రేవతి, హస్త, ఉత్తరఫల్గుని, మృగశిర, రోహిణి ఈ ౭ ను మోక్షనక్షత్రము లనియు నెఱుంగునది.

సూర్యే ధర్మగతే తథా హిమకరే ధర్మాదిసంస్థే క్రమా
ద్యాయీ భంగమవాప్నుయాదథ జయం క్రోధాదనర్థం జయమ్,
స్థాయీయాద్విజయం సభంగవికలం తద్విగ్రహం సంగరం
భృత్యాజాండజసంగరే చ గమనే సర్వత్ర రాజ్ఞాం యుధి. 194

వ్యా. సూర్యే ధర్మగతే పూర్వోక్తధనిష్ఠానక్షత్రసప్తకే గతే, సతి, తథా హిమకరే చంద్రే ధర్మాదిసంస్థే ధర్మార్థకామమోక్షనక్షత్రేషు స్థితే సతి చ, యాయీ క్రమాత్, భంగం, జయం, క్రోధాదనర్థం, జయం అవాప్నుయాత్. స్థాయీ తు, విజయం సభంగి వికలం, తద్విగ్రహం. సంగరమియాత్. ప్రాప్నుయాత్. తేనాయమర్థస్సంపన్నః సూర్యే ధర్మగతే చంద్రేఽపి ధర్మగతే సతి యాయినో భంగః, చంద్రే అర్థగతే సతి విజయః, చంద్రే కామాఖ్యగతే సత్యపజయః, చంద్రే మోక్షాఖ్యగతే సతి విజయః, యాయిన ఇతి సర్వత్రానుషంగః. సూర్యే ధర్మగతే చంద్రేఽపి ధర్మాఖ్యనక్షత్రే గతేసతి, స్థాయినో విజయః, చంద్రే అర్థగతే భంగః, చంద్రే కామాఖ్యగతే పరాజయః, చంద్రే, మోక్షగతే, స్థాయినో యుద్ధం చేతి, భృత్యాజాండజసంగరే భృత్యయోః భటయోః అజయోః మేషయోః అండజయోః కుక్కుటయోశ్చ సంగరే యుద్ధే, రాజ్ఞాంయుధి చ, గమనే ప్రయాణే చ, సర్వత్ర సర్వదా, ఇదం విచారణీయమితి శేషః.

తా. సూర్యచంద్రు లిరువురు పూర్వశ్లోకోక్తధర్మనక్షత్రముల యం దుండునపుడు రాణువ చేర్చుకొని యుద్ధమునకుఁ బోవు రాజునకు భంగమని, చంద్రుఁ డర్థాఖ్యనక్షత్రములయం దుండునపుడు జయమని, కామాఖ్యనక్షత్రగతుఁడై యుండఁగా నపజయమని, మోక్షాఖ్యనక్షత్రగతుఁడై యుండఁగా జయమని, ఈసూర్యచంద్రులు ధర్మగతులై యుండు

సమయంబున దనపట్టణములోననుండి యుద్ధము చేయురాజునకు విజయ
మని, చంద్రుఁ డర్థగతుఁడై యుండఁగా భంగ మని, కామగతుఁడై
యుండఁగాఁ బరాజయ మని, మోక్షగతుఁడై యుండఁగా విశేషయుద్ధ
ముగు నని, భటులు పాట్లెల్ల కోళ్లు వీనికిఁ బరస్పరము కలహము
చేయించుసమయమున రాజులు యుద్ధమునకుఁ బోవుసమయమున నీ
విచార మావశ్యక మనియు నెఱుంగునది.

ఆదిత్యేఽర్థగతే తథా హిమకరేఽప్యర్థాదిసంస్థే క్రమా
ద్బంధుద్వేషమియాజ్జయం చ వసుధాం యాయీ చ సర్వాశుభమ్,
లక్ష్మీం భంగమథాశుభం చ విజయం స్థాయీ తు సంప్రాప్నుయా
జ్జ్ఞాత్వా చక్రఫలం మయైవ రచితం సమ్యక్ప్రకారాంతరమ్. 195

వ్యా. ఆదిత్య ఇతి. ఆదిత్యే సూర్యే, అర్థగతే పూర్వోక్తార్థాఖ్య నక్షత్ర
గతే సతి, తథా హిమకరే చంద్రే, అర్థాదిసంస్థే సతి, యాయీ బంధుద్వేషం,
జయం, వసుధాం శత్రురాజ్యం, సర్వాశుభం చక్రమాదియాత్ ప్రాప్నుయాత్,
అథ స్థాయీతు, అక్ష్మీభంగం అశుభం విజయం చ, సంప్రాప్నుయాత్, అయమా
శయః, సూర్యేఽర్థగతే చంద్రేఽప్యర్థగతే సతి యాయినో బంధుద్వేషః స్థాయినో
లక్ష్మీః. చంద్రే కామగతే యాయినోజయః, స్థాయినో భంగః, చంద్రే మోక్షగతే
యాయినో భూలాభః, స్థాయినః అశుభం, చంద్రే ధర్మగతే యాయినః అశుభం.
స్థాయినో దీర్ఘద్వేషః, ప్రాచీనైః పూర్వశ్లోకోక్తప్రకార ఏవ తత్ర తత్ర ప్రతి
పాదితః, చక్రఫలం పంథారాహుచక్రఫలం, సమ్యక్ జ్ఞాత్వా విచార్య, ప్రకా
రాంతరమన్యత్ప్రకారః, మయా రచితమితి కాలామృతకారోక్తిః.

తా. సూర్యచంద్రు లర్థాఖ్యనక్షత్రగతులై యుండునపుడు
యుద్ధమునకు వెడలినరాజునకు బంధుద్వేషము, తనపట్టములోననుండి
యుద్ధముచేయురాజునకు నైశ్వర్యంబును, చంద్రుఁడు కామగతుఁడై
యుండఁగా యుద్ధమునకు వెడలినవానికి జయము, స్వస్థానమందుండి
యుద్ధముచేయువానికి భంగము, చంద్రుఁడు మోక్షగతుఁడై
యుండఁగా యాయికి భూలాభము, స్థాయికి నశుభము, చంద్రుఁడు
ధర్మగతుఁడై యుండఁగా యాయికి నశుభము, స్థాయికి దీర్ఘద్వేషములు
గలుగు ననియును, పూర్వీకులచేఁ బూర్వశ్లోకమందుఁ జెప్పఁబడియున్న
క్రమముననే తెలుచుగాఁ బ్రతిపాదింపఁ బడియున్న పంథారాహు

చక్రము లెస్సగా శోధించిన కాలామృతకారునిచే సుక్తార్థము ప్రకా
రాంతరముగ శ్లోకమందుఁ జెప్పఁబడియున్న దనియును భావము.

అర్కే కామగతే తథామృతకరే కామాదిసంస్థే క్రమా
ద్యాయీ యుద్ధమవాప్నుయాదతిధనం సర్వాపదం మంగళమ్,
యత్కించిద్విజయం ధనం శుభకరం స్థాయీ తు భంగం సదా
విద్వద్భిః క్రమశః ప్రయాణసమయే జ్ఞేయం చతుర్ణాం ఫలమ్. 196

వ్యా. అర్క ఇతి. అర్కే కామగతే కామాఖ్యనక్షత్రగతే సతి, అమృత
కరే చంద్రేఽపి, కామాదిసంస్థే, యాయీ క్రమాత్ యుద్ధం అతిధనం సర్వా
పదం మంగళమితి ఫలాని అవాప్నుయాత్, స్థాయీ తు యత్కించిద్విజయమిత్య
ద్విజయం, ధనం, శుభకరం, భంగం, చేతి, ఫలాని క్రమాత్ అవాప్నుయాది
త్యనుషంగః. అయమభిప్రాయః. సూర్యే కామాఖ్యనక్షత్రగతే, చంద్రే చ
తన్నక్షత్రగతే, యాయీ యుద్ధం, స్థాయీ తు యత్కించిద్విజయం, చంద్రే
మోక్షగతే, యాయీ అతిధనం స్థాయీ తు ధనం, చంద్రే ధర్మగతే, యాయీ
సర్వాపదం, స్థాయీ శుభకరం, చంద్రేఽర్థగతే, యాయీ మంగళం, స్థాయీ
భంగం, అవాప్నుయాదితి, విద్వద్భిః ప్రయాణసమయే చతుర్ణాం ఫలం సూర్యే
కామగతే చంద్రస్య కామమోక్షధర్మార్థావస్థానాం ఫలం క్రమశో విజ్ఞేయం
సమ్యగ్విచారణీయమిత్యర్థః.

తా. సూర్యుఁడు కామాఖ్యనక్షత్రగతుఁడై యుండునపుడును
చంద్రుఁడు కామమోక్షధర్మార్థనక్షత్రగతుఁడై యుండునపుడును పట్ట
ణము వెడలి యుద్ధమునకుఁబోయినరాజు, యుద్ధము, అతిధనము, సర్వా
పదమంగళ మను చతుర్విధఫలములను, తనపురముననేయుండి యుద్ధము
చేయురాజు కించిద్విజయము ధనము శుభము భంగమును చతుర్విధ
ఫలంబులను బొందుననియు, విద్వాంసులచేత నీ చతుర్విధఫలవిచార
మవశ్యముగఁ జూడఁదగినదనియు తెలియఁగ నగు.

భానౌ మోక్షగతే తథాప్యుడుపతౌ మోక్షాదిసంస్థే క్రమా
ద్భంగం సర్వజయం శ్రియం చ సమియాద్యాయీ చ సంధిం సహ,
స్థాయీ చాశు జయం మహీం చ మహతీం భంగం మహావిగ్రహం
పంథారాహుగతం ఫలం చ లిఖితం ధర్మాదిచక్రం త్విదమ్. 197

వ్యా. భానావితి. భానౌ సూర్యే, మోక్షగతే మోక్షాఖ్యనక్షత్రగతే,
ఉడుపతౌ ఉడూనాం నక్షత్రాణాం పతిశ్చంద్రస్తస్మిన్నపి మోక్షాదిసంస్థే క్రమా
ద్యాయీ భంగం సర్వజయం శ్రియం సంధిం సామోపాయం సమియాత్, స్థాయీ

తు జయం మహతీం విపులాం మహీం పృథివీం భంగం మహద్విగ్రహం చాశు శీఘ్రం సమితయాత్. అయం భావః. సూర్యే మోక్షనక్షత్రగతే చంద్రే తద్గతే సతి యాయీ భంగం స్థాయీ అధికజయం, చంద్రే ధర్మనక్షత్రగతే యాయీ జయం స్థాయీతు భూలాభం, చంద్రే అర్థగతే యాయీ శ్రియం స్థాయీభంగం, చంద్రే కామనక్షత్రగతే యాయీ సంధిక్రియాం స్థాయీ కలహం సమియాత్. ఇదం పంథా రాహుచక్రగతం ఫలం లిఖితం తం శ్లోకచతుష్టయోక్తం ధర్మాది చక్రమిత్యుచ్యతే.

తా. చంద్రసూర్యు లిరువురు మోక్షాఖ్యనక్షత్రగతులై యుండు నపుడును, సూర్యుఁడు మోక్షగతుఁడై యుండఁగా జంద్రుఁడు ధర్మార్థ కామనక్షత్రగతుఁడై యుండెనేని యట్టిసమయంబున రాణువను జేర్చుకొని యుద్ధమునకువెడలిన ప్రభువు భంగమును, స్వరజయమును, సంపదను, సామోపాయమును నీచతుర్విధఫలములఁ గ్రమముగాఁ బొందుననియును, చంద్రసూర్యు లుక్తక్రమంబున నుండఁగాఁ దనపురంబుననే యుండి యుద్ధముచేయు రాజు జయమును శత్రురాజ్యమును భంగమును విశేషకలహమును నీఫలంబులఁ గ్రమంబుగఁ బొందుననియును, పంథారాహుచక్రఫలము తెలియునది. అనఁగా: శ్లోకచతుష్టయమందుఁ బ్రతిపాదింపఁబడినయర్థమే ధర్మాదిచక్రం బని వ్యవహరింపఁబడుచున్న దనియు నెఱుంగవలయు.

అవ. అథ సూర్యచంద్రనాడీవివేకమాహ.—

నాసాదక్షిణభాగజాతపవనస్సూర్యాఖ్యనాడీ శుభా
సంగ్రామవ్యవహారమైథునభయస్నానాన్నభంగార్తిషు,
నాడ్యన్యా శశినశ్శుభైవ గమనాలంకారపాణిగ్రహ
క్షేత్రాద్యేషు యదంశవాయుచలనే తత్పాదపూర్వం వ్రజేత్. 1?8

వ్యా. నాసేతి. నాసాదక్షిణభాగజాతపవనః నాసాయాః యో దక్షిణభాగః తత్ర జాతో యః పవనో వాయుః సఏవ సూర్యాఖ్యనాడీత్యుచ్యతే, సా నాడీసంగ్రామవ్యవహారమైథునభయస్నానాన్నభంగార్తిషు సంగ్రామో యుద్ధం, వ్యవహారః క్రయవిక్రయాదివ్యాపారః, మైథునం మిథునకర్మ, భయం రాజభీతిః, స్నానం మంగళస్నానం, అన్నం అన్నశబ్దేన భోజనకాలో లక్ష్యతే. భంగః పరాజయః, ఆర్తిః పీడా ఏతాసు, శుభాశుభప్రదా, అన్యా నాడీ, నాసావామ భాగజాతవాయుః శశినః చంద్రసంబంధినీనాడీత్యుచ్యతే, సా చంద్రనాడీ గమనాలంకారపాణిగ్రహక్షేత్రాద్యేషు ప్రయాణ భూషణవివాహకృషికర్మసు శుభా, యదంశవాయుచలనం యద్భాగవాయుచలనం భవతి, తత్పాదపూర్వం

తద్భాగచరణపూర్వం వ్రజేత్, సంగ్రామాదిషు దక్షిణపాదపూర్వం ప్రయాణాదిషు వామపాదపూర్వం వ్రజేదితి భావః.

అవ. చంద్రసూర్యనాడీవివేకముఁ జెప్పుచున్నాఁడు.—

తా. నాసికమునకు కుడిప్రక్కనున్న రంధ్రమునందు సచరించుచున్న వాయువు సూర్యనాడి యనియు, ఈసూర్యనాడి యుద్ధము, మంగళస్నానము, భోజనకాలము, పరాజయము, మనగపీడ మొదలగు కార్యములవిషయమై శుభకరం బనియును, నాసికమునకు నెడమప్రక్కనున్న రంధ్రమందు సంచరించువాయువు చంద్రనాడియనియు, ఆనాడి భూషణధారణము, వివాహము, వ్యవసాయము మొదలగుకార్యములవిషయమై శుభకరం బనియు, నాసికమునకు నేభాగమునం దేవాయువు సంచరించుచుండునో ఆభాగపాదసంచారము ముందుగాఁ జేయవలయు ననియు నభిప్రాయము,

అవ. సర్వదిగ్గమననిర్ణయమాహ.—

కౌబేరీముదయే రవేస్సురపతేర్దేశం తు మధ్యందినే
సాయం వారుణదేశమంతకదిశం యాతాఽర్ధరాత్రే వ్రజేత్.
గోధూళావభిజిత్యుషస్యపి గతిస్సర్వాసు దిక్ష్వర్థదా
మందాహోషసి కింపునశ్చ గమనే లగ్నాదిశుద్ధిం వినా. 199

వ్యా.—కౌబేరీమితి. రవేరుదయే సూర్యోదయకాలే, కౌబేరీముదీచీం దిశం, మధ్యందినే మధ్యాహ్నే సురపతేర్దేశం ప్రాగ్దిశం, సాయంకాలే వారుణదేశం పశ్చిమదిశం, అర్ధరాత్రే అంతకదిశం దక్షిణదిశం, యాతా వ్రజేత్, గోధూళౌ అభిజితి ఉషసి చ సర్వాసు దిక్షు చతుర్దిక్షు అర్థదా గోధూళ్యభిజిదుషసాం స్వరూపం ప్రాగేవోపపాదితత్వాన్నేహ లిఖ్యతే, మందాహోషసి శనివాసరోషఃకాలే, లగ్నాదిశుద్ధిం వినాపి, గమనే ప్రయాణే, అర్థదేతి కిం పునః కిము వక్తవ్యం, శన్యుషసః శుక్రబుధచంద్రహోరాక్రాంతత్వాదితి భావః. మందాహోషసీత్యస్య శుక్రవారస్య చరమయామ ఇత్యర్థః.

అవ. సర్వదిగ్గమననిర్ణయమును జెప్పుచున్నాఁడు.—

తా. ప్రయాణకర్త సూర్యోదయకాలమునందు త్తరమునకును, మధ్యాహ్నకాలమునందు తూర్పునకును, సాయంకాలమునందు పశ్చిమమునకును, అర్ధరాత్రియందు దక్షిణంబునకును పైనముఁ బోవునేని యిష్టసిద్ధి గలుగు ననియు, గోధూళి అభిజిత్ ఉషఃకాలములయందు

నేదిక్కునకు ప్రయాణము వెళ్లినను ధనలాభము గలుగు ననియును శస్త్యపగకాల మనఁగా, శుక్రవారచరమయామ మనుట యీకాలము శుక్ర బుధ చంద్రహోరాక్రాంత మైయుండుఁ గాన లగ్నాది యేవిచారమును జేయక అట్టికాలమందు ప్రయాణము వెళ్ళినవారికి సర్వాభీష్ట సిద్ధి గలుగు ననియు నభిప్రాయము.

అవ. ప్రయాణే ముఖ్యతమనక్షత్రాణి తత్తన్మునిసమ్మతకాలం చ దర్శయతి.—

పాణిస్థాధ్వని కార్యసిద్ధిరనిశం మైత్రే ప్రయాతస్య తు
జ్యేష్ఠాయాముషితస్య తత్ర హి పునర్మూలే ప్రయాతస్య తు,
మాండవ్యస్య మునోర్జయో హ్యుషసి చేద్గార్గ్యస్య యానం మతం
స్యాత్సమ్యక్ఛకునం బృహస్పతిమతం తత్రాపి యాత్రా తదా. 200

వ్యా. పాణీనేతి. మైత్రే అనూరాధానక్షత్రే, ప్రయాతస్య పుంసః, అధ్వని మార్గ ఏవ, అనిశం సర్వదా, కార్యసిద్ధిః పాణిస్థా హస్తగతా, అవిఫలేత్యర్థః. జ్యేష్ఠాయాముషితస్య ప్రయాతస్య, ఏవం పునః మూలే మూలానక్షత్రే ప్రయాతస్య చ, తత్ర మార్గ ఏవ కార్యసిద్ధిః పాణిస్థా, మాండవ్యస్య ఋషేః మనోజయః, ఇదానీం కార్యమవశ్యంభవతీతి నిస్సంశయచిత్తం మతమిష్టం, గార్గ్యస్య తూషసి చేద్యానం ప్రయాణం శుభకరమితి మతమిష్టం, బృహస్పతిమతం తు సమ్యక్ఛకునం శుభశకునం స్యాద్యది తత్రాపి తదానీమేవ యాత్రార్థదేతి మతం, శకునస్వరూపం తు అగ్రే వక్ష్యతి యద్యపి జ్యేష్ఠానక్షత్రముత్తమేషు హస్తాదిషు వా మధ్యమేషు శతభిషగాదిషు వా నోక్తం, తత్రాప్యత్రోత్తమత్వేన స్వీకృతత్వాదవధేయమ్.

అవ. ప్రయాణవిషయమై ముఖ్యమగునక్షత్రములను, ఆయా మునులకు నిష్టంబులగు కాలంబులను జెప్పుచున్నాఁడు.—

తా. అనూరాధానక్షత్రమందును జ్యేష్ఠయందును మూలయందును ప్రయాణము వెడలినవారికిఁ గార్యసిద్ధికరస్థితమై యుండు, ననఁగా, నిర్విఘ్నంబుగ నిష్టసిద్ధి గలుగు ననుట చిత్తమం దేసంశయము నుంచక నిపుడిష్టసిద్ధి గలుగునని పైనమువెళ్లెడివారి కీపర్వ్వలాభంబులు చేకూరునని మాండవ్యమహామునిమతం బనియు, గార్గ్యమహర్షిమతము ఉషఃకాలమునందుఁ బైనముపోవువారలకు నిష్టసిద్ధి గలుగు ననియు, బృహస్పతిమతమెప్పుడు శుభశకునము లగుచున్నవో యపుడుఁ బ్రయాణము వెడలుట లాభకరమనియు, ఇట్లు శకునస్వరూపము ముందుఁ జెప్పఁ

బడుచున్న దనియు జ్యేష్ఠస్థాననక్షత్ర ముత్తమమధ్యమనక్షత్రములలో గ్రహింపఁబడక పోయినను ఇచ్చట నుదాహరించుటవలన నుత్తమం బనియు నెఱుంగునది.

అవ. ప్రయాణలగ్నాదిద్వాదశభావేషు తత్తద్గ్రహస్థితిఫలమాహ.—

ఆయుర్వృద్ధ్యర్థజయాన్నమిత్రకలహస్త్రీవ్యాధిభోగోత్సవ
ప్రాప్త్యప్రాప్తికరాః క్రమాచ్ఛుభఖగా యాత్రాగ్రహాదిస్థితాః,
క్రూరాస్త్వామయభీతిభూషణరిపుభ్రాంత్యర్థపీడామృతి
క్రోధానర్థవసుంధరావ్యయకరాస్స్యుర్యాతురేవాధ్వని. 201

వ్యా. ఆయురితి. యాత్రాగ్రహాదిస్థితాః ప్రయాణలగ్నప్రభృతిషు ద్వాదశలగ్నేషు స్థితాః శుభఖగాః గురుశుక్రపాపాయుతబుధాక్షీణచంద్రాశ్చేతి శుభగ్రహాః, యాతుః ఆయుర్వృద్ధ్యాదికరా భవంతి. ప్రయాణలగ్నే ఉక్తగుర్వాదిశుభగ్రహాస్స్థితాశ్చేత్, యాతురాయుః ఆయుర్వృద్ధిం ప్రయాణలగ్నాత్ ద్వితీయగతాః ద్రవ్యం, లగ్నతృతీయే జయం, చతుర్థేఽన్నం, పంచమే మిత్రం బంధులాభం, షష్ఠే కలహం, సప్తమే స్త్రీలాభం, అష్టమే వ్యాధిం, నవమే భోగం, దశమే ఉత్సవం, ఏకాదశే ప్రాప్తిం, ద్వాదశే అప్రాప్తిం చ, క్రమాద్దద్యుః. వస్త్వపాప్తిం క్రూరాస్సూర్యాదిపాపగ్రహాస్తు ప్రయాణలగ్నాదిద్వాదశభావేషు స్థితాస్సంతః క్రమాదామయభీత్యాదికరాః స్యుః, యథా.—పాపా లగ్నగతాః ఆమయం రోగం, ద్వితీయే భీతిం, చోరాదిభ్యో భయం, తృతీయే భూషణం, చతుర్థే రిపుం శత్రుదర్శనం, పంచమే భ్రాంతిం చిత్తవైకల్యం, షష్ఠేఽర్థం, సప్తమే పీడాం శరీరజాడ్యం, అష్టమే మృతిం మరణం, నవమే క్రోధం, దశమే అనర్థం, ఏకాదశే వసుంధరాం భూలాభం, ద్వాదశే, వ్యయం పదార్థక్షయం చేతి క్రమాత్ అధ్వని యాతుర్దద్యుః.

అవ. ప్రయాణలగ్నాది ద్వాదశభావములయందు సూర్యాది గ్రహస్థితికిఁ బ్రత్యేకఫలములఁ జెప్పుచున్నాఁడు.—

తా. శుభగ్రహంబులగు గురుశుక్రబుధపూర్ణచంద్రులలో నెవ్వరు ప్రయాణలగ్నమునం దుండినను నాయుర్వృద్ధిని, లగ్నద్వితీయస్థానగతులై యుండునపుడు ద్రవ్యమును, తృతీయస్థానగతులై యుండిరేని జయమును, చతుర్థస్థానగతులై యుండిరేని యన్నమును, పంచమస్థానగతులై యుండిరేని బంధులాభమును, షష్ఠస్థానగతులై యుండిరేని కలహమును, సప్తమస్థానగతులైరేని స్త్రీలాభమును, అష్టమస్థానగతులైరేని వ్యాధిని, నవమస్థానగతులైరేని భోగమును, దశమస్థానగతులైరేని

యుత్సవమును, ఏకాదశస్థానగతులైరేని ఫలప్రాప్తిని, ద్వాదశగతులై రేని వస్త్రభావమును, నీక్రమంబున ఫలంబుల నిత్తురనియు, సూర్యాది పాపగ్రహంబులు ప్రయాణలగ్నాదిద్వాదశలగ్నములయం దుండిరేని రోగము, భయము, భూషణలాభమును, శత్రుదర్శనము, చిత్తవైకల్యము, ధనము, శరీరజాడ్యము, మరణము, కలహము, అనర్థము, భూలాభము, పదార్థక్షయము లనెడి ద్వాదశవిధఫలంబుల నీక్రమంబునఁ బ్రయాణకర్తకు మార్గమందుఁ గలుగఁజేయుదురని భావము.

అవ. అథ యాత్రాయోగానాహ.—

యాత్రాలగ్నగతశ్శుభోఽర్థసుఖదో యోగాఖ్య ఇందుం వినా
లగ్నస్థౌ మణిభూమిదౌ శుభఖగౌ మార్గేఽధియోగస్త్వయమ్,
లగ్నస్థాస్త్రిశుభా యదీంద్రసుఖదా యోగాదియోగాస్త్వయం
సౌమ్యాః కేన్ద్రగతాస్త్వభీష్టఫలదాస్స్యుర్‌రాజ్యయోగస్త్వయమ్.

వ్యా. యాత్రేతి. ఇందుం వినా చంద్రం విహాయ, శుభః ఏకశ్శుభగ్రహః యాత్రాలగ్నగతశ్చేత్, అర్థసుఖదః అర్థసుఖప్రదశ్చ భవేత్, అయం యోగాఖ్యో యోగః, శుభఖగౌ ద్వౌ శుభగ్రహౌ, లగ్నస్థౌ యది, మార్గ ఏవ మణిభూమిదౌ, భవతః, అయమధియోగాఖ్యో యోగః త్రిశుభాః త్రయశ్శుభగ్రహాః లగ్నస్థా యది, ఇంద్రసుఖదాః స్వర్గసుఖదా ఇత్యర్థః. అయం యోగాధియోగః, సౌమ్యాః శుభగ్రహాః, కేంద్రగతాః లగ్నచతుర్థసప్తమదశమస్థా యది, అభీష్టఫలదాః ఈప్సితఫలప్రదాతారః స్యుః. చంద్రం విహాయేతి సర్వత్రానుషంగః, అయం రాజయోగస్స్యాత్.

అవ. ప్రయాణవిషయమైన యోగనిర్ణయమును జెప్పుచున్నాఁడు.—

తా. చంద్రుఁడు వినాగా నేకశుభగ్రహమయినను ప్రయాణలగ్నమం దుండెనేని యర్థసుఖకరుఁ డగుననియు, ఇదియ యోగాఖ్యయోగమనియు, రెండుశుభగ్రహములు ప్రయాణలగ్నగతు లయి యుండిరేని ప్రయాణకర్తకు మార్గమధ్యమందు రత్నలాభ భూలాభకరు లగుదురనియు, ఇది యధియోగాఖ్యయోగ మనియు, మూఁడు శుభగ్రహములు లగ్నగతు లయియుండిరేని స్వర్గసుఖముతో సమంబగు సుఖంబును గలుగఁ జేయుదురనియు, ఇదియ యోగాధియోగ మనియు, మఱియు శుభగ్రహములు లగ్న చతుర్థ సప్తమ దశమస్థానములయం దుండిరేని సర్వాభీష్టప్రదు లగుదురనియు, నిదియ రాజయోగమనియుఁ

జంద్రుఁడు వినాగా ననునభిప్రాయ మీా చెప్పఁబడిన యోగము లన్నిఁటి యందు నూహింపవలయును.

అవ. అథ తారాబలమాహ.—

జన్మర్క్షాది పునః పునర్నవ నవ స్యుస్తారకాశ్చంద్రయు
గ్ధిష్ణ్యాంతం గణయేత్సమాశ్శుభఫలాస్సాంత్యాస్సదా నేతరాః,
తాసు త్ర్యాద్యచతుర్ద్వితీయచరణాస్త్యాజ్యాశ్చ శాకం గుడం
దానం స్యాల్లవణం చ హేమ సలిలం తచ్ఛేషపాదాశ్శుభాః. 203

వ్యా. జన్మర్క్షాదీతి. జన్మరాశిజన్మనక్షత్రమారభ్య చంద్రయుగ్ధిష్ణ్యాంతం చంద్రస్థితనక్షత్రపర్యంతం నవ నవసంఖ్యాః, క్రమేణ పునః పునర్గణయేద్యది తారకాః తారాస్స్యుః. సాంత్యాః అంత్యేన పరమైత్రేణ సహితాః సమాస్సమతారాః శుభఫలదాస్సాశ్ఫలదా భవంతి. ఇతరాః నవమాతిరిక్తవిషమతారాః, న శుభఫలదాః విషమాస్వపి కేషాం చిత్పాదానాం శుభఫలదత్వమస్తీత్యాహ.—తాస్వితి. తాసు జన్మవిపత్ప్రత్యఙ్నైధనాఖ్యవిషమతారాసు, క్రమాత్, త్ర్యాద్యచతుర్ద్వితీయాః పాదాస్త్యాజ్యాః అయం భావః జన్మతారాయాం, తృతీయపాదః, విపత్తారాయామాద్యపాదః, ప్రత్యక్తారాయాం చతుర్థపాదః, నైధనతారాయాం ద్వితీయపాదస్త్యాజ్యః జన్మతారాయాం శాకం, విపత్తారాయాం గుడం, ప్రత్యక్తారాయాం లవణం,నైధనతారాయాం సలిలం తిలసహితం హేమ సువర్ణం, దానం దానవిషయం స్యాదేవం చేత్తచ్ఛేషపాదాశ్శుభాస్స్యుః.

అవ. తారాబలనిర్ణయమును జెప్పుచున్నాఁడు.—

తా. జన్మనక్షత్రము మొదలు చంద్రుఁ డుండునక్షత్రమువఱకు పలుమాఱు తొమ్మిదినక్షత్రముల గణన చేయవలయును, అట్లు గణన చేయఁగా నవతారలగు నట్టితారలలో పరమమైత్ర మనఁగాఁ దొమ్మిదవ తారతోఁగూడ సమతారలు శుభఫలదములనియు, మిగత జన్మ, విపత్, ప్రత్యక్,నైధనములనెడి నవమాతిరిక్తవిషమతారలు నిషేధవిషయము లనియు, నిట్లు నిషేధింపఁబడిన జన్మాదినైధనాంతవిషమతారలలో జన్మ తారయందుఁ దృతీయపాదము విపత్తారయం దాద్యపాదము ప్రత్యక్తార యందు నాల్గవపాదము నైధనతారయందు రెండవపాదము నశుభకర ములు గాన నీపాదములను నిషేధింపఁగా శేషించినపాదములు దాన పూర్వకముగ యాత్రోపాదేయము లనియు, నది యెట్లనిన . జన్మతారకు

శాకదానమును విపత్తారకు గుడమును ప్రత్యక్తారకు లవణమును నైధనతారకు నువ్వులతోఁగూడిన సువర్ణమును దానముచేసిరేని నిషిద్ధవ్యతిరిక్తపాదములు శుభకరము లగుననియు నెఱుఁగునది.

అవ. అథ చంద్రబలమాహ.—

షష్ఠైకాదశసప్తమాద్యదశమేష్విందుస్తృతీయే శుభ
స్తారాచంద్రబలం త్విదం విగణయేజ్జన్మాది చంద్రాంతతః,
యాత్రాదిష్వథ పంచమే ద్వినవమే పక్షే వళక్షే శశీ
కృష్ణే త్వంత్యచతుర్థరంధ్రసదనేష్విత్యాహురన్యే శుభః. 204

వ్యా. షష్ఠేతి. ఇందుశ్చంద్రః షష్ఠైకాదశసప్తమాద్యదశమేషు తృతీయే చ స్థితశ్చేత్, శుభః శుభకరో భవతి. ఇదం శ్లోకద్వయోక్తం, తారాబలచంద్రబలం జన్మాదజన్మనక్షత్రజన్మరాశిమారభ్య, చంద్రాంతతః చంద్రనక్షత్ర చంద్రరాశిపర్యంతం విగణయేత్, తారాబలే జన్మనక్షత్రమారభ్య చంద్రనక్షత్రపర్యంతం చంద్రబలే జన్మరాశిమారభ్య చంద్రరాశిపర్యంతమితి విశేషః. మతాంతరమాహ.— పక్ష ఇతి. వళక్షే పక్షే శుక్లపక్షే, పంచమే ద్వినవమే ద్వితీయనవమయోశ్చ స్థితోఽపి శశీ, యాత్రాదిషు ఆదిశబ్దేన సకలశుభకర్మస్వపి శుభః, కృష్ణే కృష్ణపక్షే, అంత్యచతుర్థరంధ్రసదనేషు ద్వాదశచతుర్థాష్టమేషు, శుభ ఇత్యన్యేఽప్యాహుః.

అవ. చంద్రబలమును జెప్పుచున్నాఁడు.—

తా. జన్మరాశి మొదలు చంద్రుఁ డుండురాశివఱకు గణనచేయఁగా జంద్రుఁడు జన్మరాశియందును, జన్మరాశికి తృతీయషష్ఠైకాదశసప్తమదశమరాసులయందు నుండెనేని శుభకరుఁడనియు, తారాబలవిషయమై జన్మనక్షత్రము మొదలు చంద్రస్థితనక్షత్రమువఱకును జంద్రబలవిషయమై జన్మరాశి మొదలు చంద్రస్థితరాశివఱకు గణనచేయవలయు నని గ్రంథకర్త యభిప్రాయము. మతాంతరం బెట్లనిన: శుక్లపక్షమందుఁ బంచమ ద్వితీయ నవమస్థానములయందును, కృష్ణపక్షమందు ద్వాదశచతుర్థాష్టమస్థానములయందును, ఉన్నచంద్రుఁడు సకల శుభకర్మల విషయమై శుభకరుఁ డని గ్రంథాంతరాభిప్రాయము.

అవ. అథ నిర్గమనలక్షణమాహ.—

తల్లగ్నే గమనం న చేన్నరపతిః ఖడ్గాదిసంచాలయే
న్మిత్రైర్మిత్రగృహం పితృగ్రహసురాన్ సంపూజ్య తద్దిక్షతిమ్,

ఏతన్నిర్గమనం త్రిరాత్రమవధిః పశ్చాద్వ్రజేన్మంగళై
ర్విప్రాదిర్వసుతండులాద్యపి నయేత్స్వాత్పంచరాత్రావధిః. 205

వ్యా. తల్లగ్న ఇతి. తల్లగ్నే బలయుక్తలగ్నే, గమనం న చేత్ న సంభవతి యది, తదా నరపతిః, రాజా పితృగ్రహసురాన్ పితరః ప్రసిద్ధాః గ్రహాః సూర్యాదయః సురాః గృహదేవతాః తాన్ కించ తద్దిక్పతిం యాం దిశం గమిష్యతి తద్దిగధిపతిం చ సంపూజ్య, ఖడ్గాది ఆదిశబ్దేన ఛత్రచామరాదిరాజచిహ్నం గృహ్యతే, మిత్రైస్సహ మిత్రగృహం బంధుగృహం ప్రతి సంచాలయేత్, బంధుగృహే యాపయేదితియావత్. పితౄన్ సంపూజ్యేత్యనేన ఆభ్యుదయికం శ్రాద్ధం కర్తవ్యమితి గమ్యతే. ఏతన్నిర్గమనమిత్యుచ్యతే. ఏతస్య త్రిరాత్రమవధిః పశ్చాత్త్రిరాత్రానంతరం మంగళైస్సూర్యాదిభిః సహ వ్రజేదితి రాజ్ఞామయం విధిః. విప్రాదిః ఆదిశబ్దేన వైశ్యశూద్రయోర్గ్రహణం, వసుతండులాదివిప్రాణాం వసు హిరణ్యం, వైశ్యానాం తండులం, శూద్రాణాం వస్త్రాదికమిత్యాదిశబ్దార్థః. నయేత్ నిక్షిపేత్, ఏతేషాం నిర్గమనస్య పంచరాత్రావధిః పంచరాత్రం అవధిర్యస్య తత్ తథోక్తం, శేషం సమానమ్.

అవ. నిర్గమనమునకు లక్షణమును జెప్పుచున్నాఁడు.—

తా. పూర్వోక్తక్రమంబుగ బలయుక్తమగు లగ్నమందుఁ బైనము పోవుట కనుకూలింపనియెడల నట్టి సమయంబున క్షత్రియుఁ డభ్యుదయిక శ్రాద్ధముచేసి సూర్యాదినవగ్రహంబుల నిష్టదేవతల నేదిక్కును గూర్చి పైనము పోవఁదలఁచియున్నాఁడో యాదిగధిపతిని భక్తితోడఁ బూజించి రాజచిహ్నంబులగు ఛత్రచామరాదులఁ గైకొని బంధుసమూహంబుతో వెడలి యాఛత్రచామరంబుల బంధుగృహంబున నునిచి యనంతరంబు పైనము పోవచ్చు నిదియ నిర్గమనంబు. దీనికి మూఁడు రాత్రు లవధియని విప్రులుక్తక్రమంబున నిర్గమనముఁ జేయునెడల స్వర్ణమును, వైశ్యులు బియ్యమును, శూద్రులు వస్త్రములు మొదలయిన వానిని బంధుగృహంబున నునిచి పంచరాత్రపర్యంతము క్షత్రియులు దప్ప బ్రాహ్మణులు మొదలగువారు పైనము పోవచ్చును.

అవ. అథ యాత్రాయాం శుభశకునాన్యాహ.—

భారద్వాజమయూరచాషనకులా ముఖ్యాస్త్వముఖ్యాః ఖగా
స్తేషాం చోర్ధ్వగతిః ప్రదక్షిణగతిః సమ్యక్స్వమీపస్థితిః,
ఏకస్యైవ గతిశ్శుభాఽథ యుగపన్నైవోభయోశ్చేద్గతి
స్సార్వత్రీక్షురసృగాలకుక్కుటశునాం వామా గతిస్త్వర్థదా. 206

